Twenty Five Years ago, with great imaginations, you started this work for helping our women-folk. It is my hope and desire that its activities will expand and that assistance will be rendered to a larger number of people hereafter.

—*S. Radhakrishnan.*



# ఆంధ్ర మహిళ

సంపుటి 20 మార్చి 64 సంచిక 3

## విషయసూచిక

ముఖచిత్రం :

రాజకుమారి అమృత కౌర్



ఆంధ్ర మహిళ

7 ఎ, రోజరీ చర్చిరోడ్, మద్రాసు-శాంథోమ్

# యుగయుగాలనాటి ఉగాది

ప్రకృతి మాత పిలుపుతో
పూదేనెల మాధురులతో
కోయిలల స్వాగత గీతాలతో
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాలనాటి ఉగాది !!

చరిత్ర కంతు దొరకని అనాది
వాసంత విలాసపు పునాది
తెలుగునాటి సంవత్సరాది
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాల నాటి ఉగాది !!

భానుమండల ప్రదక్షిణంచేస్తూ
బయలుదేరిన చోటికే వస్తూ
కాలగతిని జ్ఞప్తికి తెస్తూ
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాల నాటి ఉగాది !!

ఆది మానవుడి నుంచీ
ఆధునిక మానవుడి వరకూ,
శాతి యుగం నుంచీ
రాకెట్ యుగం వరకూ,
జగ పరిణతికి సాక్షిగా
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాల నాటి ఉగాది !!

మానవ జీవిత పరి భ్రమణంలో
గతించింది మరో ఏడాది !
ఏమి సాధించావ్ ? ఏది నీ గమ్యం ? అంటూ
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాల నాటి ఉగాది !!

షడ్రుచులతో సుఖ దుఃఖాలను
చవి చూపిస్తూ
మానవుడి మనోవృత్తులను పరీక్షిస్తూ
రానున్న మరో ఏటికి నాంది పాడుతూ
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాల నాటి ఉగాది !!

ఇది క్రోధి ఉగాది !
అరవై ఏళ్ళ అనంతరం
తిరిగి వచ్చిందీ ఏడాది,
అన్నీ కొత్త ముఖాలేనని
అవలోకిస్తూందీ క్రోధి !
బుద్బుద ప్రాయపు
జీవన ప్రమాణాన్ని గని
అబ్బుర పడుతోందీ క్రోధి !
విశ్వ శాంతిని కాంక్షిస్తా
నంటోందీ క్రోధి !
క్రోధాలు మాపడానికే వచ్చా
నంటోందీ క్రోధి !
సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని
పెంపొందిస్తా నంటోందీ క్రోధి !
మనందరికీ ఆరోగ్య సౌభాగ్యాలు
ప్రసాదిస్తా నంటోందీ క్రోధి !
వేచి చూదాం యీ క్రోధి బడాయిలు !
ఏటేటా వస్తుంది ఉగాది
యుగ యుగాల నాటి ఉగాది !!

శ్రీమతి నిడుమోలు ప్రసూన




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 20 :: మార్చి 1964 :: సంచిక 3

# శ్రద్ధాంజలి

రాజకుమారి అమృత్ కౌర్ ఫిబ్రవరి ఆరవ తేదీ ఉదయం పరమపందిచడంతో, బాపూజీ శకం లోని మరొక వ్యక్తి తెరమరుగై పోయారు. గాంధీజీ శిష్యులలో మరొకరు రాలిపోయారు. భారతా వనిలో జన్మించిన మరొక ప్రముఖ స్త్రీ చరిత్ర పుటలకి చెంది పోయారు.

రాజ కుటుంబంలో పుట్టి భోగభాగ్యాలతో తులతూగుతూ వున్న యీమె హంసతూలికా తల్పాలు చీని చీనాంబరాలూ అతిసునాయాసంగా విసర్జించి, బాపూజీ తలపెట్టిన స్వాతంత్ర్య సమరం లోనికి దూకారు. భారత స్వాతంత్ర్య సమరంలోకి సామాన్యులు దూకడం వంటిది కాదు యీమె ధీరత్వం. అసూర్యం పశ్య – ఎండ కన్నెరు గనిది యీ రాజకుమారి.

“హీనస్థితిలో వున్న నీ తోటి సోదరీమణులకు చేయూతనియ్యి. వారికి నీ ఆధారమూ నీ సహాయమూ రెండు అవసరము” అన్న బాపూజీ అమరవాక్యాలు రాజకుమారి అమృతకౌర్ జీవితాదర్శములయాయి. ఈ వాక్యములే ఆమె తన మార్గంగానూ, ధ్యేయంగానూ తీసుకుని జీవించింది. మాతా శిశుసంక్షేమ పథకాలని విస్తృతపరచడానికి యీమె చేసిన కృషి గణనీయమైనది; చిరస్మరణీయమైనది.

ఆధునిక యువతులు పాశ్చాత్యులను గుడ్డిగా అనుకరించడము యీమె గర్హించేది. “వినయాన్ని, పవిత్రతనీ భారతీయ యువతులు తమ జీవితలక్ష్యంగా భావించాలి. ఆడంబరాలకు బానిసలై గాలిపాటుకు కొట్టుకొని పోకూడదు. విద్యపట్ల ఆధునిక యువతులు స్పష్టమైన, నిలకడైన అభిప్రాయాలు కలిగివుండాలి. తమకి అనువగు వుద్యోగాలని ఎన్ను కోగలిగిన విచక్షణాశక్తి ఆధునిక యువతి కలిగి వుండాలి” అంటూండేవారు.

స్త్రీ విద్య, వివాహ, వుద్యోగ విషయాల పై యీమె కున్నటువంటి స్పష్టమైన అభిప్రాయాలు మన దేశంలో చాలా మందికి లేవు. ఉపన్యాస వేదికలనీ, చట్టాలనీ యీమె ఏనాడూనమ్మ లేదు. ప్రతిదీ వాస్తవ దృష్టితో పరిశీలించి మాట్లాడే వారు.

వరకట్న నిషేధపు బిల్లు పాసయిన తొలిరోజుల్లో ఆమె యిలా అన్నారు. "చట్టాలు శాసనాలూ మానవనైజాన్ని ఏకాలంలోనూ, ఏదేశంలోనూ మార్చలేదు; మార్చలేవు. వరకట్న నిషేధపు బిల్లు పాసు చేసినంత మాత్రాన కలిగే ప్రయోజనం ఏమీ వుండదు. ఈ వరకట్న నిషేధమన్నది యువతీ యువకుల దృక్పథంలో రావలసిన మార్పు. ఈ పరివర్తన శాసనసభలలోనూ, న్యాయ శాస్త్రగ్రంధాలల్లో వచ్చి ప్రయోజనంలేదు. వ్యక్తులలో రావాలి అప్పుడే ప్రయోజనకారి అవుతుంది"

ఈమె కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రిగా వున్నప్పుడు కొనితెచ్చిన మార్పులు యీమెకు తోటి స్త్రీలపట్ల వాస్తవ పరిస్థితులపట్లా గల సానుభూతికి నిదర్శనలు. నర్సింగ్, టీచింగ్ కోర్సులలో అధికసంఖ్యలో స్త్రీలుపాల్గొనాలని కోరేది. ఆరోగ్య భీమాపథకాలూ, సంక్షిప్త నర్సు శిక్షణ, శిశుసంరక్షణ విషయం మొదలగువాటిలో యీమె కొనితెచ్చిన మార్పులవల్ల అనేకులు సత్ఫలితములను పొందుతున్నారు.

మన జనాభా పెరుగుదలతో గ్రామీణ ప్రాంతాలకి ప్రసూతి వైద్యసౌకర్యాలు విరివిగా అవసరమవుతున్నాయి. నర్సులసంఖ్య త్వరితగతిని పెరగడానికి సంక్షిప్తనర్సు శిక్షణ పథకాన్ని అసలు జరిపారు యీమె. ఆస్కీము క్రిందనే "ఆక్జిలరీ నర్స్ మిడ్. వైఫ్ కోర్సులు" ప్రారంభించారు. అక్జిలరీనర్స్ మిడ్‌వైఫ్‌కోర్సు ప్రప్రథమమున మద్రాసులో ఆంధ్ర మహిళాసభ ప్రారంభించగల గౌరవమూ, సదవకాశమూ, కలిపించారు అమృతకౌర్.

ఏ సంస్థకయినా శైశవదశలో చేయూత నియ్యటమే నిజమైన గణనీయమైన సహాయం. సంస్థ పునాదులు గట్టిపడి, ఆర్థికంగా నిలదొక్కుకున్న మీదట చేసే ధనసహాయంకంటే నిర్మాణపు తొలిరోజుల్లో చేసిన సహాయం పదిరెట్లు సత్ఫలితాల నిస్తుంది.

పన్నెండేళ్ళక్రితం 1952 లో ఆంధ్ర మహిళాసభ నర్సింగ్‌హోమ్ స్థాపించవలెనను వుద్దేశము కలుగగానే శ్రీమతి దుర్గాబాయిగారు మద్రాసు ప్రభుత్వాన్ని సంప్రదించారు. రాష్ట్రప్రభుత్వం వుచితంగా స్థలంయివ్వడానికి అంగీకరించారు. కాని నర్సింగ్ హోమ్ స్థాపించడమంటే మాటలా? ఆ కాలంలో ఆరోగ్యశాఖా మంత్రిగావున్న రాజకుమారి అమృతకౌర్ లక్షరూపాయల విరాళం మంత్రిత్వశాఖనుంచి యిప్పించడమేగాక ఈ సంక్షిప్తనర్సు శిక్షణా తరగతుల బాధ్యతకూడా మా సభకే వప్పచెప్పారు. ఆనాడు సకాలంలో ఆమె యిప్పించిన ధనం నిజంగా పునాదిరాయివంటిదే అయింది. అటుతరువాత స్వంతభవన సేకరణా, క్రమేపీ నర్సింగ్‌హోమ్ విస్తరణా యిలా తామర తంపరగా పెరిగినవి మా పథకములు. ఇటువంటి అపురూపవ్యక్తి మా సంస్థకి అత్యంత ఆప్తురాలు. మా శ్రేయోభిలాషి మరణించింది అంటే అది మాకు ఒకతీరని లోటు. ఆమె పవిత్రాత్మకు శాంతి చేకూరుగాక.

—మాలతీ చందూర్
గౌరవ సంపాదకులు

హైద్రాబాద్

# మహిళల దినోత్సవం

ఫిబ్రవరి 13 వ తేదీన ఆంధ్ర మహిళాసభ ఎసెంబ్లీ హాలులో సరోజినీనాయుడు 85 జయంతుత్సవసభ జరిగినది ఈ సభలో మా వివిధశాఖల విద్యార్థినులూ ఆఫీసు సిబ్బందీ, సభ్యురాండ్రు మున్నగువారు పాల్గొన్నారు. మద్రాసునుంచి శ్రీమతి సరోజినీ వరదప్పన్ శ్రీమతి మందాకినీకృష్ణమూర్తి, మద్రాసు రాష్ట్ర స్త్రీ సంక్షేమశాఖ డైరెక్టర్ కుమారి రామేష్ మున్నగు ప్రముఖ మహిళలు వచ్చి పాల్గొనుట ఆనాటికార్యక్రమములకి వినూత్న ప్రత్యేకత కలిగించినది ఈ అతిధులకు శ్రీమతి సుగుణమణి, లీలా గౌరి బాజిగారులు పుష్ప హారములతో స్వాగతం చెప్పారు.

శ్రీమతి సరోజినీ వరదప్పన్ ఆనాటి సభకి అధ్యక్షత వహించారు. అధ్యక్షురాలు తమ వుపన్యాసములో— శ్రీమతి సరోజినీ నాయుడూ. శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ ల వంటి దేశ సేవికలు అడుగు జాడలు యీనాటి యువతులకి ఆదర్శ నీయములు కావాలన్నారు. వారునడిచిన త్రోవ స్త్రీజాతికి ఆచరణనీయ మన్నారు. ముఖ్యంగా స్త్రీజనోద్ధరణకి నిరంతరమ్ము పాటుబడుచు. స్త్రీజాతికి అనన్యమైన సేవజేసిన వ్యక్తి శ్రీమతి దేశముఖ్ పట్ల తమకిఅత్యంత గౌరవప్రేమలు కలవని ప్రస్తుతించారు

ఆంధ్ర మహిళాసభ ట్రస్టీ శ్రీమతి కె. సుగుణమణిగారు అధ్యక్షురాలికి. అతిధులకి స్వాగతం చెపుతూ శ్రీమతి సరోజినీదేవి అపూర్వవ్యక్తి అనీ అఖిలభారత స్త్రీల కాంగ్రెస్ కమిటీకి తొలిఅధ్యక్షురాలు, భారత దేశంలో తొలి స్త్రీ గవర్నరు. పాశ్చాత్యులకి తన కవితాగానాన్ని వినిపించచేసిన ప్రప్రధమ భారతీయ నారి, బాపూజీ అనుంగు శిష్యురాలు, భారతజాతీయ సమరంలో ఆరోగ్య, ఐశ్వర్యాలని కోల్పోయిన వీర నారి భారత స్త్రీజాతికి వొకప్రత్యేక వ్యక్తిత్వమును కల్పించిన ప్రజ్ఞాశాలి అంటూ శ్రీమతి సరోజినీ దేవిని ప్రస్తుతించారు

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి ఎమ్. ఎల్, సి. తమ వుపన్యాసంలో, సరోజినీదేవి జీవిత ఘట్టాలని వివరిస్తూ భారతీయ కవితాతిలక సరోజినీదేవియొక్క జన్మదినం మహామహిళా దినముగా కేంద్ర ప్రభుత్వము పరిగణింప బూనుట ముదావహమైన విషయమన్నారు. భారతప్రధాని నెహ్రూజన్మదినం బాలలదినంగానూ రాష్ట్రపతి రాధాకృష్ణ జన్మదినం వుపాధ్యాయ దినంగానూ పరిగణించినట్లే, శ్రీమతి సరోజినీదేవి జన్మదినాన్ని మహిళల దినంగా పరిగణించడం—ఆ పూజ్యురాలికీ, మనకీ అందరికీ అత్యంతగౌరవ ప్రదమైన విషయమన్నారు.

మాజీ శాశన సభా సభ్యురాలు, శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి గారు సరోజినీదేవి జీవితంలో ముఖ్య ఘట్టాలని వివరిస్తూ ఆనాటి ఆమె పరిపూర్ణ విజీతం యీనాటి మనకి ఆదర్శ మార్గము కావాలి అన్నారు

కుమారి ఎ విజయలక్ష్మి వందన సమర్పణతో జాతీయగీతంతో ఆనాటి సభ ముగిసినది.



*

# బేసిక్ విద్యావారము

ఆంధ్ర మహిళా సభలోని బేసిక్ శిక్షణా తరగతులు యిటీవలనే ప్రారంభింపబడినా, ఈ శిక్షణా శాల యింకా శైశవదశలో నేవున్నా—భారతావనిలోని అన్ని బేసిక్ స్కూళ్ళకిమల్లేనే మేమూ అమితోత్సాహముతో ఈ విద్యావారము జరుపుకున్నాము. ఆరు సంవత్సరాలుగా జనవరి 20—26 తేదీల మధ్యలో బేసిక్ వారోత్సవం జరుగుచున్నది. బేసికు శిక్షణావశ్యకతగూర్చి ప్రజలకి బాగుగా బోధపరచడానికీ, బహుళ ప్రచారానికీ యీ వారోత్సవం జరుపబడుతున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు రెండూ ఈ వుత్సవాలకి తగు ప్రోత్సాహము దోహదమూ యిస్తున్నాయి.

శైశవదశలో నుండి పారాడి, యిప్పుడిప్పుడే అడుగులు వేస్తున్న మా బేసికుట్రెయినింగ్ స్కూలు యీ వారోత్సవ సందర్భాన వుపన్యాసాలు, చర్చలూ, తెలుగు హిందీభాషల్లో వక్తృత్వపు పోటీలు, ఆట పాటలు, ఫాన్సీడ్రస్ కాంపిటిషన్, సాంఘిక సేవా కార్యక్రమం యిలా రోజుకొక కార్యాచరణతో ఆ వారం రోజులూ వినోద, విజ్ఞాన, వికాసయుతముగా గడిచినవి.

బెజవాడ మునిసిపల్ హైస్కూల్ రిటైర్డ్ హెడ్ మాస్టరు శ్రీ యమ్. వి నారాయణమూర్తిగారు గాంధీతత్వము బేసికు విద్యావిధానము' అను విషయమై సోదాహరణముగా, సులభగ్రాహ్యపద్ధతిని వుపన్యసించిరి. 'బేసికు విద్యావిధానమూ- దాని మంచి చెడుగులు, నిర్మాణాత్మక కృషిద్వారా విద్య' యీ రెండు విషయముల గూర్చి హిందీ తెలుగు భాషలలో వక్తృత్వపు పోటీలు జరుపబడినాయి. ఈ పోటీలకు శ్రీ సి. వి. హనుమంత రావుగారు, శ్రీమతి తిమ్మాబాయి. ఎ. విజయలక్ష్మి మున్నగువారు అధ్యక్షత వహించారు.

కత్తిరింపులూ, సంగీతమూ, రాట్నమూ, తకలీ వీటిల్లో పోటీలూ, నేటి విద్యావిధానంలోని లోపాలూ వాటిని బేసికు విద్యావిధానం వలన సరిదిద్దగల అవకాశాలూ' గూర్చి వ్యాస రచనాపోటీలు నిర్వహింపబడినాయి.

రింగ్ టెన్నిస్, రన్నింగ్ రేస్. మ్యూజికల్ ఛైర్స్ టెన్నిస్, మొదలగు ఆటలపోటీలు మాసభ సభ్యురాండ్రకూ, సిబ్బందికొరకూ ప్రత్యేకముగా నడుపబడినవి. వీటిలో శ్రీమతి టి. సరళామూర్తి, ఎ. విజలక్ష్మి ప్రథమ ద్వితీయ స్థానములు గెలుచుకున్నారు.

విచిత్ర వస్త్రధారణ పోటీలు నిర్వహింపబడినాయి. వీటికి శ్రీ, సి. పి. రాఘవరావు నాయుడు, శ్రీ. బి. సూర్యనారాయణ గారలు న్యాయ నిర్ణేతలుగా వుండి పోటీలను జయప్రదము గావించారు.

జనవరి 25 వ తేదీన మధ్యాహ్నం మూడు గంటలకు బేసిక్ ట్రయినింగ్.విద్యార్థినిలూ ఆఫీసు సిబ్బందీఅంబర్ పేటకు మా విద్యానగరం నుండి కాలినడకన వెళ్లారు. అంబర్ పేటలోని మురికివీధులనూడ్చి అచ్చటి పిల్లలకు స్థానపానాదులను గావించి శ్రమదానము చేశారు.

బేసిక్ ట్రయినింగ్ శాఖ శిక్షణా విద్యార్థినిలు తయారుచేసిన:—వస్తుప్రదర్శనజరిగినది. మా స్కూలు విద్యార్థినిలు పెంచుతున్న కూరగాయల తోటను వ్యవసాయ శాఖ వున్నతోద్యోగులు వచ్చి పరీక్షించారు.

ఈ వారోత్సవముల ఆఖరు రోజున అనగా జనవరి 26 వ. తేదీన నాలుగు గంట్లకు ఆంధ్రమహిళా సభ ఎసెంబ్లీహాలులో బహిరంగ సభ ఏర్పాటు చేయబడినది. ఈ సభకు శ్రీ సి పి రాఘవరావు నాయుడు అధ్యక్షత వహించారు బాపూజీకి యీ బేసిక్ విద్యావిధానము అత్యంత ప్రీతి పాత్రమైనదనీ, వారి ఆదర్శముల రూపమే యీ విద్యావిధానమనీ అన్నారు. శ్రీ బి. సూర్యనారాయణ గారు. నిర్బంధ ప్రాథమిక విద్యా విస్తృత పథకాల ననుసరించి. వుపాధ్యాయుల శిక్షణ కూడా త్వరితగతి విస్తృత పరిచే ఆవశ్యకతను గూర్చి ప్రసంగించారు.

అధ్యక్షులు, వుపన్యాసకులూ సభలకి విచ్చేసి ఈ వుత్సవాలను జయప్రదముగావించుట తమసంస్థఅదృష్టమని మా సభ బేసిక్ ట్రయినింగ్ స్కూలు. ప్రధానోపాధ్యాయులు శ్రీ. సి. రాజరత్నం కొనియాడారు. అనంతరం ఫాన్సీ డ్రస్, వెరైటీ యంటర్ టైన్ మెంట్, సాంస్కృతిక కార్యక్రమమూ మొదలగునవి బేసిక్ శిక్షణా విద్యార్థినులు ప్రదర్శించారు. గెలుపోందిన వారికి బహుమతుల ప్రధానంతో, జనగణమణ జాతీయ గీతంతో బేసిక్ విద్యా వారోత్సవాలు ముగిసినవి.



హైద్రాబాద్

# మహిళల దినోత్సవం

ఫిబ్రవరి 13 వ తేదీన ఆంధ్ర మహిళాసభ ఎసెంబ్లి హాలులో సరోజినీనాయుడు 85 జయంత్యుత్సవసభ జరిగినది. ఈ సభలో మా వివిధశాఖల విద్యార్థినులూ ఆఫీసు సిబ్బందీ, సభ్యురాండ్రు మున్నగువారు పాల్గొన్నారు. మద్రాసునుంచి శ్రీమతి సరోజినీ వరదప్పన్ శ్రీమతి మందాకినీకృష్ణమూర్తి, మద్రాసు రాష్ట్ర స్త్రీ సంక్షేమశాఖ డైరెక్టర్ కుమారి రామేష్ మున్నగు ప్రముఖ మహిళలు వచ్చి పాల్గొనుట ఆనాటి కార్యక్రమములకి వినూత్న ప్రత్యేకత కలిగించినది ఈ అతిధులకు శ్రీమతి సుగుణమణి, లీలా గౌరి బాజిగారులు పుష్ప హారములతో స్వాగతం చెప్పారు.

శ్రీమతి సరోజినీ వరదప్పన్ ఆనాటి సభకి అధ్యక్షత వహించారు. అధ్యక్షురాలు తమ వుపన్యాసములో— శ్రీమతి సరోజినీ నాయుడూ, శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ ల వంటి దేశసేవిలక అడుగు జాడలు యీనాటి యువతులకి ఆదర్శనీయములు కావాలన్నారు. వారునడిచిన త్రోవ స్త్రీజాతికి ఆచరణనీయమన్నారు. ముఖ్యంగా స్త్రీజనోద్ధరణకి నిరంతరమ్ము పాటుబడుచు. స్త్రీజాతికి అనన్యమైన సేవజేసిన వ్యక్తి శ్రీమతి దేశముఖ్ పట్ల తమకిఅత్యంత గౌరవప్రేమలు కలవని ప్రస్తుతించారు

ఆంధ్ర మహిళాసభ ట్రస్టీ శ్రీమతి కె. సుగుణమణిగారు అధ్యక్షురాలికి. అతిధులకి స్వాగతం చెపుతూ శ్రీమతి సరోజినీదేవి అపూర్వవ్యక్తి అనీ అఖిలభారత స్త్రీల కాంగ్రెస్ కమిటీకి తొలిఅధ్యక్షురాలు, భారత దేశంలో తొలి స్త్రీ గవర్నరు. పాశ్చాత్యులకి తన కవితాగానాన్ని వినిపింపచేసిన ప్రప్రధమ భారతీయ నారి, బాపూజీ అనుంగు శిష్యురాలు, భారతజాతీయ సమరంలో ఆరోగ్య, ఐశ్వర్యాలని కోల్పోయిన వీర నారి భారత స్త్రీజాతికి వొక ప్రత్యేక వ్యక్తిత్వమును కల్పించిన ప్రజ్ఞాశాలి అంటూ శ్రీమతి సరోజినీ దేవిని ప్రస్తుతించారు

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి ఎమ్. ఎల్. సి. తమ వుపన్యాసంలో, సరోజినీదేవి జీవిత ఘట్టాలని వివరిస్తూ భారతీయ కవితాతిలక సరోజినీదేవి యొక్క జన్మదినం మహామహిళా దినముగా కేంద్ర ప్రభుత్వము పరిగణింప బూనుట ముదావహమైన విషయమన్నారు. భారతప్రధాని నెహ్రూజన్మదినం బాలలదినంగానూ రాష్ట్రపతి రాధాకృష్ణ జన్మదినం వుపాధ్యాయ దినంగానూ పరిగణించినట్లే, శ్రీమతి సరోజినీదేవి జన్మదినాన్ని మహిళల దినంగా పరిగణించడం—ఆ పూజ్యురాలికీ, మనకీ అందరికీ అత్యంత గౌరవ ప్రదమైన విషయమన్నారు.

మాజీ శాసన సభా సభ్యురాలు, శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి గారు సరోజినీదేవి జీవితంలో ముఖ్య ఘట్టాలని వివరిస్తూ ఆనాటి ఆమె పరిపూర్ణ విజీతం యీనాటి మనకి ఆదర్శ మార్గము కావాలి అన్నారు

కుమారి ఎ. విజయలక్ష్మి వందన సమర్పణతో జాతీయగీతంతో ఆనాటి సభ ముగిసినది.



# బేసిక్ విద్యావారము

ఆంధ్ర మహిళా సభలోని బేసిక్ శిక్షణా తరగతులు యిటీవలనే ప్రారంభింపబడినా, ఈ శిక్షణా శాల యింకా శైశవదశలోనేవున్నా—భారతావనిలోని అన్ని బేసిక్ స్కూళ్ళకిమల్లేనే మేమూ అమితోత్సాహముతో ఈ విద్యావారము జరుపుకున్నాము. ఆరు సంవత్సరాలుగా జనవరి 20—26 తేదీల మధ్యలో బేసిక్ వారోత్సవం జరుగుచున్నది. బేసికు శిక్షణావశ్యకతగూర్చి ప్రజలకి బాగుగా బోధపరచడానికీ, బహుళ ప్రచారానికీ యీ వారోత్సవం జరుపబడుతున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు రెండూ ఈ వుత్సవాలకి తగు ప్రోత్సాహము దోహదమూ యిస్తున్నాయి.

శైశవదశలో నుండి పారాడి, యిప్పుడిప్పుడే అడుగులు వేస్తున్న మా బేసికుట్రెయినింగ్ స్కూలు యీ వారోత్సవ సందర్భాన వుపన్యాసాలు, చర్చలూ, తెలుగు హిందీభాషల్లో వక్తృత్వపు పోటీలు, ఆటపాటలు, ఫాన్సీడ్రస్ కాంపిటిషన్, సాంఘిక సేవా కార్యక్రమం యిలా రోజుకొక కార్యాచరణతో ఆ వారం రోజులూ వినోద, విజ్ఞాన, వికాసయుతముగా గడిచినవి.

బెజవాడ మునిసిపల్ హైస్కూల్ రిటైర్డ్ హెడ్ మాస్టరు శ్రీ యమ్. వి నారాయణమూర్తిగారు. గాంధీతత్వము బేసికు విద్యావిధానము' అను విషయమై సోదాహరణముగా, సులభగ్రాహ్యపద్ధతిని వుపన్యసించిరి 'బేసికు విద్యావిధానమూ- దాని మంచి చెడుగులు, నిర్మాణాత్మక కృషిద్వారా విద్య' యీ రెండు విషయముల గూర్చి హిందీ తెలుగు భాషలలో వక్తృత్వపు పోటీలు జరుపబడినాయి. ఈ పోటీలకు శ్రీ సి. వి. హనుమంత రావుగారు, శ్రీమతి తిమ్మాబాయి. ఎ. విజయలక్ష్మి మున్నగువారు అధ్యక్షత వహించారు.

కత్తిరింపులూ, సంగీతమూ, రాట్నమూ, తకలీ వీటిల్లో పోటీలూ, నేటి విద్యావిధానంలోని లోపాలూ వాటిని బేసికు విద్యావిధానం వలన సరిదిద్దగల అవకాశాలూ' గూర్చి వ్యాస రచనాపోటీలు నిర్వహింపబడినాయి.

రింగ్ టెన్నిస్, రన్నింగ్ రేస్. మ్యూజికల్ ఛైర్స్ టెన్నిస్, మొదలగు ఆటలపోటీలు మాసభ సభ్యురాండ్రకూ, సిబ్బందికొరకూ ప్రత్యేకముగా నడుపబడినవి. వీటిలో శ్రీమతి టి. సరళామూర్తి, ఎ. విజలక్ష్మి ప్రథమ ద్వితీయ స్థానములు గెలుచుకున్నారు.

విచిత్ర వస్త్రధారణ పోటీలు నిర్వహింపబడినాయి. వీటికి శ్రీ, సి. పి. రాఘవరావు నాయుడు, శ్రీ. బి. సూర్యనారాయణ గారలు న్యాయ నిర్ణేతలుగా వుండి పోటీలను జయప్రదము గావించారు.

జనవరి 25 వ. తేదీన మధ్యాహ్నం మూడు గంటలకు బేసిక్ ట్రయినింగ్.విద్యార్థినిలూ ఆఫీసు సిబ్బందిఅంబర్ పేటకు మా విద్యానగరం నుండి కాలినడకన వెళ్లారు. అంబర్ పేటలోని మురికివీధులనూడ్చి అచ్చటి పిల్లలకు స్థానపానాదులను గావించి శ్రమదానము చేశారు.

బేసిక్ ట్రయినింగ్ శాఖ శిక్షణా విద్యార్థినిలు తయారుచేసిన—వస్తుప్రదర్శనజరిగినది. మా స్కూలు విద్యార్థినిలు పెంచుతున్న కూరగాయల తోటను వ్యవసాయ శాఖ వున్నతోద్యోగులు వచ్చి పరీక్షించారు.

ఈ వారోత్సవముల ఆఖరు రోజున అనగా జనవరి 26 వ. తేదీన నాలుగు గంట్లకు ఆంధ్రమహిళా సభ ఎసెంబ్లీహాలులో బహిరంగ సభ ఏర్పాటు చేయబడినది. ఈ సభకు శ్రీ సి పి. రాఘవరావు నాయుడు అధ్యక్షత వహించారు బాపూజీకి యీ బేసిక్ విద్యావిధానము అత్యంత ప్రీతి పాత్రమైనదనీ, వారి ఆదర్శముల రూపమే యీ విద్యావిధానమనీ అన్నారు. శ్రీ బి సూర్యనారాయణ గారు. నిర్బంధ ప్రాథమిక విద్యా విస్తృత పథకాల ననుసరించి. వుపాధ్యాయుల శిక్షణ కూడా త్వరితగతి విస్తృత పరిచే ఆవశ్యకతను గూర్చి ప్రసంగించారు.

అధ్యక్షులు, వుపన్యాసకులూ సభలకి విచ్చేసి ఈ వుత్సవాలను జయప్రదముగావించుట తమసంస్థఅదృష్టమని మా సభ బేసిక్ ట్రయినింగ్ స్కూలు. ప్రధానోపాధ్యాయులు శ్రీ. సి. రాజరత్నం కొనియాడారు. అనంతరం ఫాన్సీ డ్రస్, వెరైటీ యంటర్ టైన్ మెంట్, సాంస్కృతిక కార్యక్రమమూ మొదలగునవి బేసిక్ శిక్షణా విద్యార్థినులు ప్రదర్శించారు. గెలుపొందిన వారికి బహుమతుల ప్రధానంతో, జనగణమణ జాతీయ గీతంతో బేసిక్ విద్యా వారోత్సవాలు ముగిసినవి.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఅడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్.సి., పరీక్షలకు శిక్షణ.

**పారిశ్రామిక విద్యాలయము** • కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము.

**మహిళా మందిరము** : విద్యార్థినులకు వసతి గృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

**నర్సింగ్ హోమ్** : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది.

**ఆర్థోపీడిక్ సెంటర్** : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం.

**ముద్రణాలయము** : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూఫురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు చేయబడును.

**నాగేశ్వర శిశువిహార్** : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది.

**వనితా బాలవిహార్** . స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం

## ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

(1) ప్రాంతీయ చేతిపనుల శిక్షణాయలం. (2) సంక్షిప్త విద్యాప్రణాళిక, (3) చేనేత శిక్షణ- ఉత్పత్తికేంద్రము, (4) బేసిక్ విద్యాశిక్షణాలయం (5) శిశువిహార్ (6) కుటుంబ నియంత్రణ శాఖ. (7) ఆక్జలరినర్స్ మిడ్‌వైఫ్ ట్రయినింగ్ (8) వసతిగృహము.





# తక్షశిల



వారణాసి
యశోదాదేవి

(గతసంచిక తరువాయి)

తక్షశిలా విశ్వవిద్యాలయ ముండినస్థానము. సిర్కాఫ్ గ్రామమునుండి 4 మైళ్ళ దూరము పూర్వపు తక్షశిల బహిఃప్రదేశమున గానవచ్చు చున్నది. విశ్వవిద్యాలయము పశ్చిమమున దలాభి విశ్వవిద్యాలయము, తూర్పున నలందా, మధ్యదేశమున ధాన్యకటకము, దక్షిణ దేశమున కంచి విశ్వవిద్యాలయములవలె వాసిగాంచెను. తక్షశిలయందు వేద శాస్త్రములు, ధనుర్విద్య, వివిధ కళలలో శిక్షణ యియ్యబడుచుండెను. సంపూర్ణ విద్యాభ్యాసమునకు వుపాధ్యాయులకు విద్యార్థులు చెల్లింపవలసిన రుసుము వేయి టంకములట, తక్షశిలా విశ్వ విద్యాలయము 1 వ శ॥ వరకు మహోన్నత దశ యందుండెను. పాణినివ్యాకరణ విద్యయందును, జీవకుడు వైద్య విద్యయందును యిందే విద్య నార్జించిరి. పాణిని అష్టాధ్యాయి వ్యాకరణ సూత్రముల విరచించెను; అదియే సంస్కృత వ్యాకరణ శాస్త్రమునకు మూల గ్రంథము వరరుచి వ్యాఖ్యరచించినది పాణిని సూత్రములకే; పతంజలివీటికే భాష్యమొనర్చెను. పతంజలి రచన వ్యాకరణ మహా భాష్యమని ప్రఖ్యాతమైనది. మగధాధీశుడైన బింబిసారుని కుమారుడైన అభయునకు జన్మించినవాడే జీవకుడు; తల్లి శాలావతి అభయునకు ప్రేయసి బాల్యమందు జీవకుడు జరాగృహము విడిచి తక్షశిల కేగి విశ్వవిద్యాలయములో ఆత్రేయుని • సమక్షమున వైద్య విద్య నభ్యసించెను. మంత్రి చాణక్యుడును యిచటనే విద్యాభ్యాసమొనర్చెనట.

చైనా నుండియు, అరేబియా నుండియు విద్యార్థులు యేతెంచి తక్షశిలలో సహాధ్యాయులుగ విద్యలనేర్చి తదితర ప్రపంచమునకు భారతీయ సంస్కృతిని పంచిపెట్టిరి. మహమ్మదు

ప్రవక్త (622 క్రీ. శ.) నాటికి పాండిత్యమునకు సునిశిత మేధాసంపదకు భారతీయ విశ్వవిద్యాలయములు ఆసియా ఖండమంతటను పేరు మోసినవి. ఒక్క శతాబ్దములో ననాగరికులైన సారసకులు భారతీయ సంస్కృతికి వినమ్రులైరి వేదాంతము, సాహిత్యము, విజ్ఞానములందేగాక, తక్షశిల వైద్య విద్యకు ప్రత్యేక విశిష్టత గలదై, బాగ్దాదు నుండి సునాయాసముగ విద్యార్థుల రాకను, అరబ్బుల సముద్ర యాన సౌకర్యములవలన ప్రోత్సహింపుచుండెను. విశ్వవిద్యాలయ ప్రాంతముల చుట్టును చిన్న చిన్న గదులున్న చిహ్నములు గానవచ్చుచున్నవి. గాన విద్యగాంధర్వ విద్యయనబడుటకు తక్షశిలలో లలిత కళలకు నధిక ప్రాముఖ్యముండి యుండును.

తక్షశిలలో బౌద్ధ శిల్పశిథిలములు లోయ దక్షిణపు చెంతను తామ్రనాళా నదీ తీరమున గుట్టలపై గానవచ్చుచున్నవి. ఇచట త్రవ్వకములు, పరిశోధనలు క్రీ. శ. 1850ప్రాంతమున ప్రారంభింపబడినవి. క్రీ. శ. 1863 లో కన్నింగుహాము తక్షశిలను గుర్తించెను. షా పూరు యొద్ద నొక స్తూపములోని పాత్రపైనున్న శాసనమును, మొహ్రామలియారాన్ యొద్ద రెండు దేవాలయములను, దానిలో నొకదానియందలి గ్రీకు స్తంభమును సమన్వయించి దీనినికనిపెట్టెను. తర్వాత ఇరువదేండ్ల సర్ మార్షలు యిచట పరిశోధనల గావించెను.

క్రీ. పూ. 5 శ. నుండి క్రీ. శ. 5-వ శ॥ తక్షశిలలో వరుసగ పర్షియనులు, గ్రీకులు, మౌర్యులు, బ్రాక్ట్రియన్ గ్రీకులు, శాకులు, పార్థియనులు, కుషానులు రాజ్య మేలిరి. కాబట్టి వారి ముద్రలు దేశీయ కళలందును, సంస్కృతి యందును రూపొందియున్నవి. పారశీక ముద్ర గాంధార శిల్పమందును, గ్రీకు ప్రాబల్యము భీర్ దిబ్బలో దొరకిన కుండలు, బంకమట్టి ప్రతిమలు, నాణెములు, రత్నశిలలో దెలియవచ్చుచున్నవి. గ్రీకు శిల్పము భరత భూమిలో స్థల, కాల, మానప్రవృత్తుల బట్టి మార్పు జెందినది. శిర్కాపు శిథిలములలో హైందవ ఛాయలకంటె గ్రీకు చాలికలు మిక్కుటముగ గలవు. గాంధార శిల్పము భారతదేశపు వాయవ్య సరిహద్దుకవ్వల దెసను స్వాట్ ప్రాంతమున రూపొంది, తక్షశిలలో పార్థియనుల కాలమున ప్రవేశించి కుషానుల కాలమున ప్రగతిగాంచి క్రీ. శ. 3-వ ॥శం॥ న రూపుమాపినది.

ప్రస్తుతము చిర్ తోపు యనబడు ధర్మరాజిక స్తూపము తామ్రనాళమున కెగువను పీఠభూమిపైనున్నది దీనిని బహుశః క్రీ. పూ. 3-వ శ॥ న॥ అశోకుడు నిర్మించెను. ఇది వలయాకారముగ చుట్టును ప్రదక్షిణ గల్గియున్నది. నాల్గు దిక్కులందును నధిరోహణకు సోపానములు గలవు! స్తూపకుడ్యములు 3 నుండి 5. వరకు మందము గల్గి కుషాను కట్టడములై యుండును. స్తూపము ముందువైపు శిల్పసమన్వితము వానిలో గూళ్ళలో బుద్ధుని ప్రతిమలుగలవు. ఈ స్తూపమును చుట్టుకొని యున్న చిన్నచిన్న స్తూపములు శకరాజుల క్రీ. శ. 1-వ శ॥ నాటివి. బౌద్ధులు తమ ప్రార్థనలను బట్టి ప్రదక్షిణ పథమును ముడుతూర్లు గాని, యేడుమార్లుగాని పదునాల్గులేక 108 తడవలు గాని జుట్టివచ్చుచుండిరి. ఒకప్పుడు యీ మార్గము గాజు ఫలకములచే ప్రకాశించుచుండెడిది. సింహ మకుటములుగ నొకస్తంభమును బోధిసత్వుడు అభయము దణోచత్రము క్రింద నిలబడి పరివార సహితుడై యున్న. శిల్పమును ప్రదక్షిణ పథములోగాన వచ్చినవి మరొక స్తూపములో వెండి పేటికలో జంతువులు, పక్షులు_సింహము, మకరము, కప్ప, బాతు-రూపము లందున్న గాజుపూసలు, అర్ధచంద్రుడంత రత్నఆకారము లందున్న వస్తువులు దొరకినవి. మరొకస్తూపము నందు చావడిలో నాల్గు

దేశాల కుంభపుదివ్వెలు గలవు! ఇచటి శిథిలములు కొన్ని సింహళ మందలి కాండీనగరములో దంత ధాతు దేవాలయము -Dalada -1Mal gawa-లో భద్ర పరుపబడి యున్నవి.

ధర్మరాజ స్తూపముచుట్టును వలయాకారమున కొన్ని చైత్యములు గలవు. వానిలో నొక దానిలో గుప్త రాజుల కాలపు అక్షరములతో -యేధర్మహేతు ప్రభావ-యని వ్రాయబడిన మృణ్మయ ముద్రికలు లభ్యమైనవి. కొన్ని చైత్యములలో ద్వారములకు యెదురుగ నెత్తైన బుద్ధప్రతిమలు గలవు. వానిలో నొకదాని యెత్తు 35' ఒక చిన్నస్తూపములో స్ఫటిక శిలాసింహ ప్రతిమ దొరకినది. మరిరెండు స్తూపముల మధ్య నొక వానరము బుద్ధునకు మధువును సమర్పించు గాంధారశిల్పము గానవగును, మరిరెండు కట్టడముల మధ్య త్రోవలో శిరములు లేని ధ్యాన ముద్రలో నున్న బుద్ధుని ప్రతిమ లెన్నో దొరకి యున్నవి. మరొక బాహ్య ప్రదేశమున నొక తటాకమునకు తూర్పు, పడమర లందు 4స్తూపములు గలవు. పెద్దస్తూపము సమీపమందే నొక సంఘారామ, శిథిలమును గలవు! దీని యడుగున వరుసలుగ యెన్నో సంఘారామము లుండి యుండును. వీనిలో నొక్కొక్క దానిలో కొన్ని బాహ్య ప్రదేశములు, చుట్టు రెండు అంతస్థుల గూళ్లు, వాని ముందు వరండాలు గలవు కొన్నిటికి వంటశాలలు గలవు. ఎన్నోమార్లు భగ్న పరుపబడి క్రీ. శ. 5వ శ॥ రెండవ భాగమున హూణులచే నీ సంఘారామము శిథిలము జేయబడెను. దానికి క్రిందుగ నిర్యాణా వస్థయందున్న బుద్ధుని కొక చైత్యగృహము గలదు. ఒక చిన్న చైత్యములో నొక గాజుపాత్రయు, నందు రజిత పాత్రయు, దానిపై నొక శాసనమును, మరొక బంగారు పేటికయు లభ్యమైనవి శాసనము క్రీ. శ. 78 సం॥ నాటిది. ఖరోష్టిభాషలో నున్నది మరొక వలయాకారపు స్తూపము పై దక్షిణపు వైపున గౌతముడు వజ్రధారితో కపిలవస్తు నగరము నుండి నిష్క్రమణమును, ఉత్తరపు వైపున కంటకాశ్వము. గౌతముని సెలవు దీసికొను దృశ్యమును గాంధార శిల్పశైలిలో నున్నవి. గౌతమ నిష్క్రమణమును కౌతారామ మోహన శాస్త్రివర్ణ చిత్రములగ మనోహరముగ చిత్రించి యున్నారు. రెండవ శిల్పములో కంటకాశ్వము మోకాళ్లపై వంగి గౌతముని పాదముల చుంబించుచుండ నొక చెంప చందకుడు, రెండవ వైపు వజ్రధారి వీక్షించు చున్నట్లు చిత్రింప బడినది. ధర్మరాజక యావరణమునకు పశ్చిమమున గజపృష్ఠాకార మందున్న చైత్యాలయము గలదు. ఇందులోపలి భాగము 8 వైపులు గల్గియున్నది. ఇట్టిదే మరొక చైత్యాలయము శిర్కాపులో నున్నది.

నిరంతరము ప్రవహించు నీటి యూట పార్శ్వమున గిరికనుముపై స్తూపములయొక్క, సంఘారామముల శిథిలములు గలవు. ఈ ప్రాంతముల వేలకొలదిగ నుండిన బౌద్ధసన్యాసులు విదేశదండ యాత్రలందు నీ దుర్గముల దాగియుండు చుండిరి. ఇటనొక స్తూపము 62' చదరమై 15' ఎత్తుగల్గి యున్నది. దక్షిణమున నొక సంఘారామము క్రింది యంతస్థులో నిరువది గదులు గల్గియున్నది మరొక సఘారామములో స్నానమునకు నాల్గు వైపుల 18 అరలు, వానిలో చిన్నగూళ్ళుగలవు; మహానసగృహములు, భోజనశాలలుగలవు. పార్థియనుల, కుషానులనాటి విహారములకు వంటశాలలు గానరావు, కారణము ఆకాలమున బౌద్ధ భిక్షువులు వీధులలో భిక్షాటనముసల్పి భుజించు చుండుటయే.

ఒక స్తూపముపై నొక గాంధార శిల్పము బుద్ధదేవునకు యిరుకెలంకుల పరిచారకులతోను, సమ్ముఖమున మృగముల తోను యింద్రశాల గుహాయందు ఆసీనుడై యున్న దృశ్యమును రూపించుచున్నది, పైనుండి నల్గురు దేవతలు

# MALE FAMILY PLANNING CLINIC.

**No .. .. . R/U** **Date: 3-2-1964**

**Return for the month of January 1964**

**Address of clinic - ANDHRA MAHILA SABHA NURSING HOME, Madras-28**

| | | Up to the end Of previous month. | During month under review |
|---|---|---|---|
| | Population served by the clinic - | | |
| 1 | Persons contacted for F P education. | 192 | 52 |
| 2 | No of cases given advice | 27 | 8 |
| 3. | No of active cases following F P. Methods | 24 | 8 |
| 4 | Clinic attendance | 162 | 52 |
| 5 | No of new persons visited at home for:- | | |
| | (i) New contacts | 102 | 25 |
| | (ii) follow-up | 35 | 14 |
| | Cost of contraceptives (in Rs.) supplied by the Clinic - | Rs np | Rs np. |
| 6 | Free | 9-32 | 2-86 |
| 7 | At half rates | | ... |
| 8. | At full rates. | | ... |
| 9 | Total | | ... |
| | Sterlization cases referred to Hospital - | | |
| 10 | Male | 24 | 5 |
| 11. | Female | . | ... |
| 12 | Total. | . | ... |
| | Nature of advice given (Give No of cases) | | |
| 13 | Diaphragm and Jelly. | .. | ... |
| 14. | Jelly alone | .. | ... |
| 15. | Sheath | 27 | 8 |
| 16. | Safe period | ... | ... |
| 17. | Foam Tablets | ... | ... |
| 18 | Others (Specify) | | |
| 19 | Total | 27 | 8 |
| | Meetings - | General | Group |
| 20 | No. held. | | ... |
| 21 | No. of persons attended. | ... | ... |

Signature Medical officer I/C (Sd) Dr. K Sreenivasa Rao.

# వడ్డాణం

మూలం · కల్కి

అనువాదం · శిద్ధవటం శ్రీరాం

స్వర్ణ అర్ధరాత్రి ఉలిక్కిపడి కళ్ళుతెరిచింది. తలుపులు తెరిచే శబ్దం వినబడింది. ఆవలిస్తూ పడుకున్నట్టె చెవులు నిక్కబొడిచింది సుందరం మెల్లగా తలుపు తెరుస్తున్నాడు, గడపదాటి మెల్లగా తలువు మూసినాడు

సుందరం మేడమెట్లు దిగిపోయె శబ్దం వినబడింది, మరోక్షణమె క్రింద, ఆఫీసు గది తెరిచాడు, యలక్ట్రిక్ లైటువేసి లోపలికి పోయాడు

స్వర్ణకు గుండె దడ దడ కొట్టుకోవడం అధికమై పోయింది యక్షప్రశ్నలు ఉద్భవించి, ఆమె తల వేడెక్కిపోయింది ఈ అర్ధరాత్రిలో, ఈయనగారు ఎక్కడికి...ఎందుకు మేడదిగాడు? ఆఫీసు గదిలోకి పోయిఇప్పుడు ఈయనగారేం చేస్తున్నారు? నాకు మెలుకువ రాకూడదని పిల్లిలాగా శబ్దం చేయకుండా అంత జాగ్రత్తగా నడిచిపోయారే? ఇలా ఎందుకు చేశారు? ఏదో నా దగ్గర మరుగు పరుస్తున్నాడు! నేను కూడా తెలుసుకో కూడని రహస్యమా ఇది? ఇందులో ఏదో లోగుట్టు వుంది!

గడిచిపోయిన అయిదారు రోజుల నుంచి సుందరం ఏదో ఒక మాదిరిగా ఉండడం గ్రహించిన స్వర్ణహృదయం కలవరపడుతూనే వుంది, ఆయన పాత మనిషిగా లేరు ఏదో ఒక మాదిరిగా వున్నారు, ఎప్పుడూ కలకలలాడుతూ చిరునవ్వు వెదజల్లే ముఖంలో అయిదారు రోజులనుంచి ఏదో విచారం. పరధ్యానం ఆవహించింది ఏం మాట్లాడుతున్నాము, ఏం తింటున్నాం అని తెలియనంతటి పరధ్యానంగా వుంటున్నారు. రాత్రులందు సరిగా నిద్రపోవడం లేదు. ఏదో పలవరింతలు...పొర్లడం... నిద్రలోనే వున్నట్టుండి శరీరం వణికిపోవడం అడిగితే చెప్పనంటున్నారు. "అబ్బే ఏమీలేదు స్వర్ణా" అంటున్నారు. అబద్ధం! వట్టి ..అబద్ధం! ..ఏమీ లేకపోతేనా ఇంత విచారం? ఇంత కలవరం?

ఏదో సమాచారం నా దగ్గర దాచెందుకు ప్రయత్నం చేస్తున్నారు. ఇందులో ఎలాంటి సందేహం లేదు! ఏమిటా సమాచారం? స్వర్ణపోయినమాసం, చూసి వచ్చిన ఒక సినిమా జ్ఞాపకం చేసుకుంది. ఆ సినిమాలో కథానాయకుడు ఒక వేశ్యవలలో పడతాడు తత్ఫలితంగా ఆ కథానాయకుడు నడతలో, వేషభాషల్లో, భావనలో ఎంతో మారిపోతాడు అప్పుడప్పుడు ముఖంలో కలవరం, భీతి గ్రహించిన భార్య ఏమైందండి...ఎందుకలా వణికిపోతున్నారు? అని అడిగితే 'ఏమీలేదూ' అని చెప్పి తప్పించుకునే వాడు,

'అలాంటిది ఏదైనా ఆయన చేసారా? అని స్వర్ణ భావించుకొని కుమిలిపోయింది. ఛీ .. ఛీ. . ఛీ! అలాంటిదేమి అయివుండదు! పది రోజులకు ముందే కదా, వారు తన మీదవుండే అనురాగాన్ని రుజువు చేసుకున్నారు? బంగారు వడ్డాణం వేసుకునేందుకు నాకేమి యోగ్యత వుంది? ఇంతకాలం నుంచి నాకు తెలియకుండా డబ్బుచేర్చి పెట్టినాకే, బహుమతిగా అర్పించారే? అని స్వర్ణ భావించి, వారు నాకు ఎన్నటికి ద్రోహం చెయ్యరు! చెయ్యబోరు! అయితే వారు దేన్నో నాదగ్గర మరుగు పరుస్తున్నారు! ఏమిటా విషయం చెప్మా?

ఆఫీసు గదిలో వారు ఏం చేస్తున్నారు? అనే కాంక్ష ఏర్పడింది. ఎలాగైనా సరే వారు, మరుగుపర్చే విషయాన్ని, వాస్తవాన్ని, తెలుసుకొని తీరాలి మనసులో సందేహమనే, పిశాచి వున్నంతకాలం ప్రశాంతంగా నిద్రపోలేను.

స్వర్ణ దృఢనిశ్చయంతో మెల్లగా లేచి నిలబడింది, పిల్లిలా చప్పుడుచేయకుండా మేడ మెట్లు దిగి, కిటికీ ప్రక్కన నిలబడి, ఆఫీసు గదిలోకి తొంగిచూసింది. సుందరం కుర్చీలో కూచుని టేబుల్‌మీదికి వంగి, ఏమో వ్రాసుకొంటున్నాడు. స్వర్ణ కొన్ని క్షణాలనుంచి చూస్తూ నిలబడ్డింది సుందరం వ్రాయడం ముగించి తల పైకెత్తాడు. లైట్ల కాంతిలో ఆయన కళ్ళ నుంచి రాలే అశ్రుబిందువులు ముత్యాల్లా మెరిసాయి.

స్వర్ణ కళ్ళు చమర్చినవి చలనంలేని శిలా విగ్రహంలా, నిలబడిపోయింది.

సుందరం ఒక కవరుతీసి దానిపై విలాసం వ్రాశాడు. టేబుల్లో నుంచి జిగురు చిప్ప తీసి చూశాడు నీళ్ళు లేక ఎండిపోయి వుండడం చూసి నీటికోసం జిగురు చిప్ప తీసుకొని వంట ఇంటివైపు నడిచాడు, వంట ఇంటికి పోయేముందు బయట కిటికీ తలుపులకు ఓరగా నిలబడి వున్న స్వర్ణను చూడనేలేదు

సుందరం వంట ఇంటికి పోయిన మరుక్షణమే స్వర్ణ గబగబా ఆఫీసు గదిలోకిపోయి టేబిల్పైనున్న కవరు తీసింది. దానిపై ఆమె పేరే వుంది వణికిపోతూనే కవరులో నుంచి ఉత్తరం తీసి చదువుకుంది.

చిరంజీవి స్వర్ణకు నా ఆశీర్వాదములు

నీకు ఈ ఉత్తరం చాలా ఆవేదనను, ఆశ్చర్యాన్ని కల్గిస్తుందని నాకు తెలుసు నీవు ఈ ఉత్తరాన్ని చదివే టప్పుడు నేను చాలా దూరం పోయివుంటాను నిన్ను విడిచివెట్టి పోయేందుకు నాకు చాలా వేదనగానేవుంది, అలాంటి క్లిష్టపరిస్థితులుఏర్పడ్డాయి నేనువిడిచి పోకుండా వుంటే నీవు చాలా బాధపడతావు ఎప్పటికి నా నుంచి నీ మనసు కష్టపడకూడదు, అందుకే ఈ వియోగం! కాబట్టి నీవు మీ అమ్మ ఇంటికి పోయి సుఖంగావుండు, నీ మీద నాకెల్లాంటి కోపంలేదు భగవంతుడు చల్లని చూపు చూస్తె మళ్ళీ నీ జీవితంలో తటస్తపడుతాను నా గురించి నీ వేదైనా అపవాదులువింటే అది నీ మీద వుండే ప్రేమాభిమానాలు అనురాగం కొద్ది చేసిందేనని నీవు అర్థం చేసుకోగలవని భావిస్తాను

ఇట్లు
జీవితంలో నిన్ను ఎన్నడు మరివలేని
నీ భర్త "సుందరం"

స్వర్ణ ఉత్తరాన్ని మళ్ళీ మళ్ళీ చదువుకుంది, ఆమె తల తిరిగి క్రింద పడకుండా సమాళించుకొని టేబిల్ మీద వాలింది, మరోక్షణమే వంట గదినుంచి జిగురు చిప్పతో వచ్చిన సుందరం, స్వర్ణ చేతిలో ఉత్తరం వుండటం చూసి అదిరిపడి గుడ్లు మిటకరిస్తూ నిలబడి పోయాడు.

భర్తను చూడగానే స్వర్ణలోని ఆనందం, వేదనలు పోటిపడి పెల్లుబికింది, ఆమె ఆఫీసు గది తలుపులు మూసి అడ్డంగా నిలబడి మీరు ఎక్కడికి పోతారో, ఎలా పోతారో, నేనూ చూస్తాను! అనే భావనలో కుమిలి పోతూ నిలబడింది

ఆమె తన ఉత్తరం చదివేసిందని సుందరం తెలుసు కున్నాడు, తప్పుచేసినవాడిలా వణికిపోతూ స్వర్ణా....? నే చెప్పేది కాస్తావిను " అని ఆరంభించాడు

"నేను వినను! వినను!! వినను!!!" స్వర్ణ బోరున ఏడ్చింది

"అయ్యో .! స్వర్ణా ..నే చెప్పేది విను.. "

"నన్ను అనాథగా చేసి నడివీధిలో విడిచి పోవాలని చూసారు! మీరు వెళ్ళిపోయాక నేను పుట్టింట సుఖంగా వుండాలా? నన్నెందుకిలా అన్యాయంచేయ దల్చుకు న్నారు?" స్వర్ణ దుఃఖంతో కుమిలిపోతూ భర్త బాహు వులపై తల వాల్చి బోరున ఏడ్చింది

## 2

సుందరానికి కుబేర బ్యాంకిలో గుమాస్తా పని ఆయన స్కూల్లో చదివేటప్పుడు అందరితో, చాలా యోగ్యుడు అని పట్టం సంపాదించాడు. టీచర్లు సుంద రం విద్యా వివేకంకన్నా ఆతనిలో మంచి గుణాన్ని మెచ్చుకొని సర్టిఫికేట్ యిచ్చారు, నిజంగానే ఆయనకు దైవభక్తి అధికం పాపభీతికి వెనుకాడే వ్యక్తి అలాంటి సుందరం తను పనిచేసే బ్యాంకి(లో)డబ్బులో నుంచి పదిహేను వందలు దొంగిలించాడని చెపితే ఆయన్ను తెలిసిన వ్యక్తులు నమ్మరు ఏలాంటి పరిస్థితు ల్లోను . ఏనాడు సుందరం అలా చేయడని వాదిస్తారు కానీ ఎవ్వరూ నమ్మని విధంగానే, సుందరం పదిహేను వందలు దొంగతనం చేసాడు అలా చేసేందుకు కార ణం ..? ఉత్తరంలో వ్రాసిన విధంగా స్వర్ణపైన వుండే అంతులేని అనురాగమె కారణం!

స్వర్ణ డిప్యూటి కలెక్టర్ సదాశివంగారి కూతురు ఆయన బ్రతికి ఆ ఉద్యోగంలోనే వుండి వుంటే స్వర్ణకు, సుందరానికి వివాహమై వుండేదికాదు ఆయన తన ఇద్దరి కూతుర్లకు గొప్ప సంబంధాలు చేసినట్లు స్వర్ణను కూడా ఒక ఐ సి, యస్, ఒక యస్, సి యస్ కో. లేక కేవలం యం, బి బి యస్ కైనా ఇచ్చి పెళ్ళి చేసే వారు అయితే స్వర్ణకు అదృష్టంలో చుక్కెదురైంది ఎదురుచూడని విధంగా సదాశివంగారిని మృత్యువు నోట కరుచుకుపోయింది, గుండె పగిలి చనిపోయినట్లు విని ప్రజలు సానుభూతిగా నిట్టూర్చారు.

చనిపోయిన సదాశివంగారు దండిగా డబ్బేమైనా చేర్చిపెట్టారా? యిన్సూరెన్సన్నా చేశారా? ఏమీలేదు.

ఇన్సూరెన్సు ఏజెంట్లు తమ ప్రచారానికి అనుకూలంగా సదాశివం గారి పేరును బాగా ఉపయోగించుకున్నారు "డిప్యూటీ కలెక్టర్ సదాశివం గారిని చూడండి! నాకూ ఇన్సూరెన్సుపై నమ్మకం ఏమాత్రమూ లేదు అని చెప్పుతూనే వుండిరి, ఉన్నట్టుండి ఒక రోజు కన్ను మూసారు అదో ఆయన భార్య బిడ్డలు ఆర్థికంగా ఎంత ఇబ్బంది పడుతున్నారో అందరూ చూస్తూనేవున్నారుగా అనడం". కాబట్టి మీరు తప్ప కుండా ఇన్సూరెన్సు చేయండి" అని హెచ్చరించటం మామూలై పోయింది, ఏజంట్లకు

సదాశివంగారు చనిపోయాక స్వర్ణ వివాహ ప్రసంగం లేచింది "ఇద్దరు కూతుర్లనులాగె స్వర్ణకుకూడా గొప్ప సంబంధం చేస్తేనే బాగుంటుందని కొందరు చుట్టాలు సలహాలిచ్చారు

ఇద్దరు కూతుర్లను గొప్పింటికి ఇచ్చి తను అనుభవించేది వివరించి 'నా స్వర్ణకు గొప్పింటి' సంబంధం వద్దే వద్దు! బీదవాడైనా సరే, గుణవంతుడుగా వుంటే అదే చాలు, స్వర్ణకు అదృష్టమేవుంటే ఆస్తిపాస్తులు తానుగానే వచ్చి చేరుతుంది'' అని స్వర్ణ తల్లి అన్నది ఆమె వాదనలో సత్యం లేకపోలేదు సదాశివంగారు ఆమెను వివాహం చేసుకున్న తరువాతే అదృష్టం ఆవహించింది, పెద్ద వుద్యోగమూ లభించింది" అని ఆ రోజుల్లో అందరూ అనుకోవడం జ్ఞాపకానికొచ్చింది, అందుకే స్వర్ణకు బీద సంబంధమైనా చేసి తీరాలని నిశ్చయించుకుంది

స్వర్ణ అక్కల్లో ఒకర్ని ఐ సి యస్స్‌కు, మరో అక్కను గొప్ప రాబడివున్న బారిష్టరుకు వివాహాలు చేసింది, సదాశివం కుటుంబము

స్వర్ణకు చిన్న సంబంధం చేయడం కూతుర్లకు, అల్లుళ్ళకు ఏ మాత్రము ఇష్టంలేదు, స్వర్ణ వివాహం తమ గౌరవ మరియాదలకు లోపంగా భావించారే కాని పెద్ద సంబంధం చేసేందుకు ఆర్థిక సహాయం చేసేందుకు ఎవ్వరూ ముందుకురాలేదు, ఇద్దరు కూతుర్లు స్వర్ణపై వుండే ప్రేమాభిమానాలు మాటల్లోనే ఒలకబోసారంతే,

''నేనేమిటి చేసేది? ఇంకా ముగ్గురు బిడ్డలు చదవాలికదా వుండే ఇల్లు వాకిలి అమ్మి స్వర్ణక్కూడా గొప్పింటి సంబంధం చేస్తే ఈ ముగ్గురి గతి ఏం కావాలి? వాళ్ళకు విద్యా బుద్ధులు చెప్పించాలి. అప్పుడు మీ నాన్న వున్నప్పుడు శక్తివుంది మీ యిద్దరికి గొప్ప సంబంధాలు చేసాను మీరు సుఖంగా వున్నారు అంతే చాలు. స్వర్ణకు అదృష్టముంటే తానుగానే, వచ్చి వాలక తప్పుతుందా? ఇద్దరు కూతుర్లను తల్లి సమాధాన పర్చింది.

ఒక శుభ ముహూర్తంలో సుందరానికి, స్వర్ణకు వివాహమైంది.

తల్లి ఆశించినట్లుగా స్వర్ణకు వివాహమయ్యాక అల్లుడికి కుబేర బ్యాంకులో ఉద్యోగం లభించింది. రెండు సంవత్సరాలు గడివకముందే జీతంపై అరవై రూపాయలు పెరిగినది

ఇంతవరకు పుట్టినింట తన భర్తతో కాపురం చేసిన స్వర్ణ ఈ రెండేళ్ళు ఏలాగో గడిపింది, ఆమెకు ఏదో లోటుగా వున్నది అరకడుపు తిన్నాసరే పుట్టి నింట వుండకూడదని నిశ్చయించుకొని వేరే కాపురం పెట్టమని భర్తను బలవంత పెట్టింది. కొద్ది రోజులకంతా పాతిక రూపాయల అద్దె ఇంట్లో ఆ దంపతులు ప్రవేసించారు. వాళ్ళ ఇంట్లోనేవుండి సుందరం తమ్ముడు కూడా చదువుకుంటూ వున్నాడు,

స్వర్ణతల్లి ఆ ఇంటికి రెండుసార్లు వచ్చిపోయింది కూతురు, అల్లుడు సంతోషంగా జీవితం గడపటం చూసి తృప్తిగా నిట్టూర్చింది "గొప్పింటి సంబంధాలు చేసుకున్న ఇద్దరి కూతుర్లకన్నా స్వర్ణచాలా సంతోషంగా ఆనందంగానే వుందని" తెలిసిన వాళ్ళకు సర్వంగా చెప్పుకుంది ఇలా సంతోషంగా వుండే కాలంలోనే స్వర్ణ కుటుంబంలో ఒక ఇత్తడి వడ్డాణం ప్రవేసించి ఆ దంపతుల జీవితంలో అశాంతిని రేపి, ఆవేదనను కలుగచేసింది.

ఒకరోజు సుందరం ఆఫీసు నుంచి ఇంటికి వచ్చే సమయంలో స్వర్ణ నడుముకు వుండే వడ్డాణాం ధగధగా మెరుస్తూ వున్నది

"సుందరం వడ్డాణ్ణం చూసి బలే' చాలాబాగా వుంది వడ్డాణ్ణము అచ్చగా నీవు అప్సరసలాగున్నావు సుమా!"

"ఈ వడ్డాణ్ణం, ధర, పదిహేను వందలట! తీసుకోవాలని చాలా ఆశగావుంది కొనిస్తారా?"

"నీకేమిటి తక్కువ? మాజీడిప్యూటి కలెక్టర్ గారి కూతురి విగా నీ పుట్టినింటుండుగకు వెంటనే జాబు వ్రాస్తే టెలిగ్రామ్ మనియార్డర్ వచ్చివాల్తుంది .." సుందరం పరాచకాలాడాడు. ఈ విధంగా ఆదంపతు

# అభినందనం

పదియు తొమ్మిది వసంతాల
ప్రాయంపు నిండు జవరాల!
పొదలాడు పత్రికాజగతి
ప్రోడవై నీ కార్యనియతి-

వదనమ్ములో వినూత్నకళ
వచ్చిందిలే, ఆంధ్రమహిళ!
పదిలముగ కైసేసు కొనవె,
ప్రాలుమాలిక బాసి,తనువె-

బాలికాడోలిక నమర్చు,
ప్రౌఢలకు వేదికను కూర్చు-
తూలికాకేళికవు కమ్మ,
తౌర్యత్రికాంతికవు కమ్మ-

కాలికవు శీర్షికలు నిలుపు,
కలిసివచ్చే కళలు తెలుపు-
కీలకపు సలహాల సిమ్ము,
గృహిణులకు వాదోగు కమ్ము!

ఎదిగితివి చిన్నారి చెలువ,
ఎత్తువారల చేతి చలువ-
ఎడ గదించితి నేనొకపుడు,
ఎరుగుదువొ, లేదొ నీవిపుడు!

వదినె లందరు వచ్చినారె,
వలపుహారతి నిచ్చు వారె-
చదివింతు నభినందనాల
సరసంపు మధ్వాక్కరాల!

నళినీ-

---

లిద్దరు కొంత సేపు గిల్లికయ్యాలు ముగించాక తను ధరించింది ఇత్తడి వడ్డాణమని, వెల ఏడురూపాయలని, రెండు సంవత్సరాల వరకు ఈ వడ్డాణం ఇలాగే మెరుస్తూనే వుంటుందని గ్యారంటి ఇచ్చారని పక్కఇంటి సుశీల తీసుకోవడం చూసి తానూ ఒకటి కొన్నానని చెప్పింది! స్వర్ణ అమాయకత్వాన్ని చూసి నవ్వుకున్నాడు సుందరం.

కొద్దిరోజులు గడిచాక తన అక్కయ్య ఇంట్లో అన్నప్రాసనకు రమ్మని పిలుపువిని స్వర్ణ తన భర్తతో కూడా బయలు దేరింది. స్వర్ణ తనుకొన్న ఇత్తడి వడ్డాణం ధరించింది సుందరానికి తృప్తిగాలేదు కాబోలు కొంచెం అయిష్టంగానే దీన్ని ఎందుకు ధరించావు స్వర్ణా ? నా మాటవిని విప్పివేయి అన్నాడు.

"నేను ఇత్తడి వడ్డాణం ధరిస్తే నన్ను జాతినుంచి వెలివేస్తారా? అలా వెలివేస్తేకూడా మనకొచ్చిన నష్టమేముంది?'' అని స్వర్ణ సాధించింది.

సుందరం నోరు మెదపలేదు.

"నీపేరు స్వర్ణం అంటే బంగారం అందులో నీవు 22 క్యారట్ల బంగారంకదా నిన్ను కరిగిస్తే నూరు క్యారట్ల బంగారు వడ్డాణాలు చేయవచ్చునుకదా' ఆఇత్తడి వడ్డాణం నీ కెందుకు?"

## 3

"అవును నేను బంగారాన్నే ఈ బంగారాన్ని మెరుగు పెట్టె మీరు మీ అనురాగం వున్నంతకాలం నాకేమిటి లోపము ?"స్వర్ణ పెళ్ళి కూతురిలా భర్తబాహువులలో వాలిపోయింది పాపం ఆ దంపతుల సంతోషము అక్కగారింటికి పోయిన మరుక్షణమే మాయమై పోయింది స్వర్ణ ధరించిన వడ్డాణం అక్కయ్య ఇంటికివచ్చిన బంధువుల దృష్టిలో పడింది. స్వర్ణ వడ్డాణం గురించి కొందరు స్త్రీలు వేలుపెట్టిచూపి గుసగుస లాడ ఆరంభించారు

ఈ వడ్డాణం ఇప్పుడే కొత్తగా వచ్చింది. ఇప్పుడు ఇదే లేటస్టుమాడల్, వెలకూడా చాలా తక్కువ... తొమ్మిది రూపాయలట!'' ఒకావిడ గొణిగింది

"వదినా ఈ వడ్డాణం వెల తొమ్మిదిరూపాయలు కాదు ప్రస్తుతం ఏడురూపాయలకే కొనేవాళ్లులేరట!'' ఇంకో స్త్రీ వివరించింది.

ఇంత తక్కువ ధరలో దొరికే వడ్డాణాలు కొనకుండా వెయ్యి, రెండువేలు పెట్టి ఎందుకు కొనాలి?"

"చింతపండుతో అప్పుడప్పుడు తోమకపోతే నల్లగా పోతుందే... అప్పుడేంచేయాలి?"

పాతపాత్రల వాడికి వేసి పెట్టి కజ్జూరం తీసితినాలి. తన వడ్డాణాన్ని అపహాస్యంచేస్తూ వున్న స్త్రీలను ఒక్కక్షణం పరిక్షగా చూసింది; ప్రతిస్త్రీ వజ్రాలు మెరిసే బంగారు నగలతో మెరిసిపోతూ వుంది; బంగారు నగలు మోయలేని స్త్రీలనడుమ ఇత్తడి వడ్డాణం ధరించిన స్వర్ణ అవమానంతో కుమిలిపోయి; "భగవంతుడా! నన్ను వేగంగా నా ఇల్లుచేర్చు" అని వేడుకుంది. భోజనాలు ముగిసాక, గుఱ్ఱపు బండికోసం భర్తను తొందరచేసింది, ఇద్దరు బండిఎక్కి కూచోబోయే ముందు స్వర్ణ అక్క పొట్లము తీసుకొనివచ్చి తనచెల్లెలికిమాత్రం వినపడేలాగ రహస్యంగా "ఏమే స్వర్ణా .! ఇలాంటి తెలివి తక్కువ పనులుచేసే ముందు, ముందు వెనక ఆలోచించక్కర్లా? ఇలాంటి ఇత్తడి వడ్డాణం వేసుకొని వచ్చావుకదూ? నలుగురు కేవలంగా భావిస్తున్నారు! ఇంకెప్పుడూ ఇలాంటి పనిచెయ్యకు! అంతగా నగలమీద ఆశగా వుంటేకొంచెంసేపు వేసుకునేందుకు నన్నడిగితే, నేనివ్వనా?" అని చెల్లెలికి అక్క, రహస్యంగాచెప్పినప్పటికీ చెప్పిందంతా, సుందరం విన్నాడు

ఇల్లుచేరే వరకూ స్వర్ణ సుందరం నిశ్శబ్దంగానే గడిపారు మూగవాళ్ళలా వుండి పోయారు స్వర్ణహృదయంలో నుంచి పొంగివచ్చే దుఃఖాన్నివిశ్వ ప్రయత్నం చేసి, నిలుపుకుంది. బండిదిగి ఇంట్లోకి పోయారో లేదో స్వర్ణ ధరించిన ఇత్తడి వడ్డాణాన్ని తీసి కోపంగా మూలకు విసిరి వెక్కివెక్కి ఏడ్చింది.

"దరిద్రం పట్టిన ఈ ఇత్తడి వడ్డాణాన్ని వేసుకొని రావద్దని, నలుగురూ కేవలంగా భావిస్తే నీవు నేను వేదన పడాలిసొస్తుందని నేను వూహించి ముందే చెప్పాను విన్నావా? అయిపోయిన దానికి ఇప్పుడు ఏడ్చి ప్రయోజనం?" సుందరం అవమాన భారంతో కృంగిపోతూ అన్నాడు.

"ఆసమయంలో మా నాన్నేవుండి వుంటే నేను నలుగురిలో ఇంత అవమానాల పాలుఅయే దాన్ని కాదు నేనూఅందరిలాగే బంగారు వడ్డాణం ధరించేదాన్ని" అని స్వర్ణ తండ్రిని తలుచుకొని వెక్కివెక్కి ఏడ్చింది.

"అవును స్వర్ణా...! మీ నాన్న బ్రతికుంటే మీ ఇద్దరి అక్కయ్యలకు గొప్ప సంబధాలు చేసినట్టే నీకూ కూడా చేసివుంటే నీవుచాలా సుఖపడే దానివి. ఈ దరిద్రుడిని కట్టుకొని నీవు ఏం సుఖం అనుభవించావు"?

సుందరం నొచ్చుకోవడం చూసిన స్వర్ణ దుఃఖాన్ని దిగమింగి భర్తహృదయంలో తలఆనించి అలా అనకండి "నిజంగా నేను మా అక్కలకన్నా, లోకంలోని చాలా మంది స్త్రీలకన్నా అదృష్టవంతు రాలిని. మీ అనురాగం, ప్రేమాభిమానలే నాకు వెయ్యి ఏనుగుల బలం... అవే నాకు వజ్రాలనగలు" స్వర్ణ దీనంగా చూసింది.

ఆక్షణమే సుందరం ఒక దృఢనిశ్చయం చేసుకున్నాడు. ఎలాగైనా స్వర్ణకు ఒక బంగారు వడ్డాణం చేయించి తీరాలి; లేకపోతే నేను మనిషినే కాదు. అని మనసులో ప్రతిజ్ఞ పూనాడు.

కొన్ని రోజులు గడిచాయి.

కుబేర బ్యాంకి దివాలా తీయ బోతుందని ప్రజల్లో వదంతిరేగింది, ఆ బ్యాంకిలో డబ్బుకూడ పెట్టిన వారు అవసరంగా డబ్బు వాపసు తీసుకోవడం ఆరంభించారు. ఈక్లిష్ట పరిస్థితుల్లో రోజూ మేనేజింగ్ డైరక్టరు వచ్చి జరగే కార్యాలను చక్కబెట్టే వాడు.

"అబ్బె ఏమీభయం లేదు. ఈలాంటి క్లిష్ట పరిస్థితులు మన బ్యాంకిలో ఎన్నో ఏర్పడ్డాయి, వాటి నన్నిటిని చక్కపర్చినట్టే దీన్ని చక్కపరుస్తాము .. భయపడ వలసిన అవసరమేమి లేదు" అని బ్యాంకి సిబ్బందికి మేనేజింగ్ డైరెక్టరు ధైర్యం చెప్పే వాడు.

కుబేర బ్యాంకి మీద ప్రజలకు నమ్మకం ఏర్పడేలా చేసెందుకు మేనేజింగ్ డైరక్టర్ తమ కాతా దారులకు అడగ గానే డబ్బుఇచ్చే ఏర్పాటు చేసాడు.

ఫిక్సడ్ డిపాజిట్లు చట్టరీత్యా అడగ్గానే ఇవ్వాలని లేక పోయినా, చాలామందికి ఫిక్సడ్ డిపాజిట్లు వాపస్ చేసారు. ఇది మాత్రమే కాదు చాలా మందికి అప్పులు, ఓవర్ డ్రాఫ్టులు శాంక్షన్ చేశాడు కుబేరాబ్యాంకిపై వుండే అపనమ్మక, దురభిప్రాయం పోవాలనే అభిప్రాయంతోనే మేనేజింగ్ డైరెక్టర్ అలాచేసాడు

ఈ విధంగా బ్యాంకిని గురించి ప్రజలకు అపనమ్మకం ఏర్పడ్డరోజుల్లోనే ఒకరోజు సుందరం చాలాసంతోషంగా ఇంటికి తిరిగివచ్చాడు.

భర్త చాలా సంతోషంగా వుండటం చూసి స్వర్ణకు ఏమీ అర్థం కాలేదు.

"స్వర్ణా....!ఈరోజు నీ పుట్టిన పండుగకదా? బజారుకు బయలుదేరు... త్వరగా బయలుదేరు...."

"నన్ను బజారుకు పిల్చుకుపోయి బంగారు వడ్డాణమూ గాజులుకొని, నా పుట్టిన పండుగకు బహూకరిస్తారా...."

"అవును స్వర్ణా! నీవు కోరిందే కొని ఇస్తా బయలు దేరు...."

స్వర్ణ భర్త మొఖంలోకి ఆశగా ఆశ్చర్యంగా చూసింది.

"నన్ను మీరు ఎగతాళి చేస్తున్నారని నాకు బాగా తెలుసు....నేనేమి నగలకోసం మొహం వాచిపోలేదు" స్వర్ణ మొఖంలో చిరుకోపంచిందులు తొక్కింది.

"నీవు నగలకు మొఖం వాచిపోలేదని తెలిసే నీకు నగలు చేయించ దలుచుకున్నాను", అని సుందరం పాంట్ జేబులోంచి చిన్న నూరు రూపాయల కట్టను తీసి భార్య చేతిలో పెట్టాడు. అంత డబ్బును చూసి స్వర్ణ ఒక్క క్షణం స్థబించిపోయింది.

"ఏమిటీ అలా బొమ్మలా నిలబడి పోయావు?"

స్వర్ణ తేరుకొని నోట్లను లెక్కపెట్టింది; మొత్తం పదిహేను వందలు వుండటంచూసి "ఎక్కడిదీ డబ్బు? నిజంగా నాకు నగలు చేయిస్తారా? ఎగతాళిచేయకండి .. చెప్పండి ..."

నిజంగా నీకు నగలు కొనడానికే ఈ డబ్బుతెచ్చాను. ప్రతి నెల జీతంలో కొంత పట్టుకోమని నేనే చెప్పాను; రెండు వేల రూపాయలు చేరాక నీకు ఈ విషయం చెప్తామనుకున్నా కాని ఓపికలేకపోయింది. ఈ రోజు నీ పుట్టిన పండుగకదా అని ఈ డబ్బుతెచ్చాను. త్వరగా బజారుకు బయలుదేరు" సుందరం భార్యను తొందర చేసాడు.

పది రోజుల లోపల స్వర్ణ రెండవసారి సుందరం హృదయం మీద వాలి ఆనంద బాష్పాలు రాల్చింది

ఆ దంపతులు ఇద్దరు బజారుకు పోయి ఒక్కొక్క నగల అంగడే ఎక్కి దిగి ఒక పెద్ద నగల అంగడిలో పదిహేను వందలకు ఒక బంగారు వడ్డాణం కొని గాజులకు ఆర్డర్ ఇచ్చి ఇంటికి తిరిగారు.

రెండు మూడు రోజులు సుందరం వున్నంత సంతోషంగా జీవితంలో ఎప్పుడూ లేడనే చెప్పాలి; స్వర్ణ నడుముకి అలంకరించిన బంగారు వడ్డాణాన్ని చూసి మురిసిపోయాడు. స్వర్ణ కళకళలాడుతూ వుడటం చూసిన సుందరం. హృదయ ఆనందంతో ఉప్పొంగి పోయింది.

స్వర్ణ కోరిక ఇంత శీఘ్రంగా. ఇంత సులభంగా ముగిసిందానికి, సుందరానికే చాలా ఆశ్చర్యంగావుంది.

తను పదిహేను వందలు కూడ పెట్టాలంటె మాటలతో పనా? ఊపిరి బిగపట్టుకొని నెలకు పది రూపాయలు మిగుల బెట్టినా, సంవత్సరానికంతా 120 రూపాయలే కదా చేరేది... పదిహేను వందలు చేరాలంటే ఎన్ని సంవత్సరాలు నిరీక్షించాలి? అబ్బ తను చేర్చిపెట్టి స్వర్ణకు బంగారు వడ్డాణం కొనే లోపల ఆ పిచ్చికుంక ఇత్తడి వడ్డాణంతోనే తృప్తి పడేదికాబోలు...!

ఒక్కొక్కసారి తను చేసిన దొంగతనం అనుకొని, భయంతో వణికిపోయి ఇది బయటపడి నలుగురికీ తెలిస్తే...? ఎంత అవమానం ..? సుందరం శరీరం వణికిపోయేది. తను అనవసరంగా భయపడుతూన్నానని తనకుతానే సమాధాన పర్చుకున్నాడు. తను చేసిన దొంగతనం ఏవిధంగాను బయటపడదు. ఆనాటి సంఘటనలన్ని సినిమా రీళ్ళలా మనసులో మెదిలాయి. ఆ రోజు జరిగిన సంఘటనలన్ని జ్ఞాపకం చేసుకున్నాడు డబ్బుకోసం వచ్చిన కాతాదార్లతో బ్యాంకి చాలా సందడిగావుంది సుందరం డబ్బు పెట్టెలోని డబ్బంతా కాళీ అయిపోయింది, ఇక ఐదు నిమిషాలవరకు డబ్బు అడిగే వారికిలేదని చెప్పే పరిస్థితుల్లో "రిజర్వు బ్యాంకి నుంచి డబ్బు వచ్చింది; ఒక్కొక్క గుమాస్తాని వచ్చి డబ్బు తీసుకొనెందుకు రమ్మని" మేనేజింగ్ డైరక్టర్ గది నుంచి పిలుపు వచ్చింది

సుందరం వంతు వచ్చేటప్పటికి అయన మేనేజింగు డైరక్టర్ గదిలోకి పోయాడు డబ్బుకోసం; పందరూపాయల, పది రూపాయల, అయిదు రూపాయల, ఒక రూపాయ నోట్ల కట్టలను లెక్కపెట్టి చూసుకుంటూ కూర్చున్నాడు; సరిగ్గా ఐదు వేల రూపాయలుంది, తనకు ఇచ్చిన డబ్బును తీసుకొని లేచివచ్చేందుకు సిద్ధంగావున్న సమయంలో మేనేజింగ్ డైరక్టర్‌కు ప్రక్కనవుండే టెలిఫోను గంట మోగింది; టెలిఫోన్‌లో ఎవరు పిల్చారో ఏమోకాని మేనేజింగ్ డైరక్టర్‌గారి మొఖం విచారంగా మార్పింది. ఆ సమయంలో మేనేజింగ్ డైరక్టర్ టెలిఫోనులో మాట్లాడడంలో నిమగ్నమై వుండటం చూసి గబాల్ని మేనేజింగ్ డైరక్టర్ క్యాష్

బాక్సులోనుంచి సుందరం రెండు నోట్లకట్టలను తీసి తన డబ్బులో వేసుకొని మేనేజింగ్ డైరక్టర్ ఫోను విడిచి వచ్చాక ఐదు వేల రూపాయలకు సంతకం చేసి తన సీటుకు గబగబానడిచి పోయాడు తన సీటు సమీపించే లోపలే సుందరం తను తస్కరించిన రెండు నోట్ల కట్ట లను తన కోటు జేబులోకి మార్చాడు.

ఆ రోజు మధ్యాన్నం అంతా సుందరానికి ఏదో అశాంతి, భయం .. వణికిపోయే శరీరానికి ఎన్నో సమా ధానాలుచెప్పి సమాళించుకున్నాడు. అతనికి తెలియ కుండానేఅతనికి ముచ్చెమటలుపోసింది; తనమీద తనకే జాలి, అసహ్యం...! పరిస్థితుల ప్రభావానికి లొంగి మన స్సాక్షికి, భయపడే సుందరంలాంటి వ్యక్తులు అంత కంటే ఏం చేస్తారు పాపం !

"ఎవరిదగ్గరైనా అధికంగా డబ్బు పొరపాటున చేరుంటే వెంటనే ఇచ్చి పొండి" అని ఎవరినైనా పంపి వుంటే తను తస్కరించిన రెండు నోట్ల కట్టలను మేనే జింగ్ డైరక్టరుకు ఒప్పచెప్పి 'అవును సార్ ఐదు వేల కన్నా నా దగ్గర ఈ డబ్బు జాస్తిగా వచ్చిందని' చెప్పి మనసు తేలిక పర్చుకునేవాడు· లేదా .అందరితోబాటు తన జేబులు జప్తు చేస్తేకూడా సిద్ధంగానేవున్నాడు సుందరము.

స్వర్ణకు అదృష్టముండబట్టి అలాంటిదేమి జరుగ లేదు.

బ్యాంకిలో 'దీని' గురించి సందడి ఏర్పడిందా అని సుందరం రెండు మూడు రోజులు ఆత్రంగా ఎదురు చూసాడు, కానీ 'దీని' గురించి ప్రశ్నలేదు డబ్బు కోసం వచ్చే కాతాదార్ల సందడి తగ్గింది, అడిగిన చాలా మంది కాతాదార్లకు ఎడ్డిలేకుండానే డబ్బు ఇచ్చారు; కాబట్టి కాతాదార్లకు ప్రజలకు బ్యాంకిమీద సదభిప్రాయం విశ్వాసం ఏర్పడింది. బ్యాంకిలో డబ్బు తీసుకున్న కాతాదార్లు చాలామంది అదే బ్యాంకిలో తీసుకున్న డబ్బు తిరిగివేసారు.

సుందరానికి మనశ్శాంతి ఏర్పడింది, ఆ మనశ్శాంతి పక్కనే అశాంతి, ఆశకూడా బయలుదేరింది.

"దొంగతనం ఎలాగో చేసాను, ఇంకా రెండు నోట్లను తీసుంటే ఎంత బాగుండును. "సుందరం కొంచెం బాధపడ్డాడు. స్వర్ణకు బంగారు వడ్డాణం, బంగారు గాజులు తీసిం తర్వాత, చేతిలో ఒక వెయ్యి రూపాయలుంటే, భవిషత్తులో అత్యవసర పరిస్థితులో ఉపయోగపడేది కదా· మళ్ళి అలాంటి ఛాన్సు తన జీవితంలో ఎప్పుడైనా లభిస్తుందా ?

## 4

కుబేర బ్యాంకుకు ఎదురుగా ఒక పెద్ద హోటల్ వుంది; ఈ ప్రసిద్ధిచెందిన హోటల్ నవనాగరికతకు తగి నట్టుగా టీ పార్టీలతో, డిన్నర్లతో, ఎప్పుడు కళకళ లాడుతూ వుంటుంది. ఆ వూరికి వచ్చే గొప్పవారంతా ఆ హోటల్లోనే మకాంవేసేవారు. మేడపైన అద్దెకిచ్చే గదులు, వరండాను సుందరం బ్యాంకిలోనుంచి...తన స్థానంలోకూర్చునే బాగాచూడవచ్చు. బ్యాంకిలోజనసందడి పలుచబడినప్పుడంతా ఆ హోటల్లో కొత్తగా అప్పు డప్పుడు బస చేసే వ్యక్తులను చూస్తూవారు ధరించే బట్టలను, నడకను, పరిక్షగా చూస్తూ కాలంగడపడం సుందరానికి అలవాటైపోయింది.

స్వర్ణకు బంగారు వడ్డాణం కొని తెచ్చిన నాలగవ రోజు సుందరం హోటల్ వరాండా వైపు అలవాటు ప్రకారం చూసాడు; మేడపైనున్న గదిలో మంచంపై కూర్చుని పుస్తకం చదువుతున్నట్టు నటిస్తు, తననే చూస్తూవుండటం చూసిన సుందరానికి కంగారు ఏర్ప డింది; తనవైపే దొంగ చూపులు చూసే వ్యక్తిని తను ఎక్కడో చూసినట్టు సందేహం కలిగింది; సుందరానికి ముచ్చెమటలు పోసింది, మరోసారి వరండావైపు వోర కన్నుతోచూసాడు."ఎవరీయన? ఈ మొఖాన్ని ఎక్కడో చూసాను. ఎక్కడ చూసాను ?" అని సుందరం దీర్ఘంగా ఆలోచించాడు; మెరుపులా తలలో మెరిసింది.

ఆ...స్వర్ణ అక్కబిడ్డ పుట్టిన పండుగ సందర్భంలో ఈ వ్యక్తి వచ్చివున్నాడు; ఈ వ్యక్తిని గురించి ఇద్దరు బంధువులు మాట్లాడుకుంటూవున్నారు.

"రామానుజం ఇప్పుడు సి. ఐ. డి గా వున్నాడు మీకు తెలుసా? డిపార్టుమెంటులో మంచి పేరు. ప్రఖ్యా తలు సంపాదించాడు, సమీపంలోనే ప్రమోషన్ అయింది" అని మాట్లాడుకున్నారు అవును సందేహంలేదు వాడే వీడు ...నిస్సందేహంగా వీడు సి.ఐ.డి.".

సుందరం శరీరం భయంతోవణికి పోయింది; ముచ్చె మటలు కారుతూవుంటె "పాడు ఎండ చంపేస్తూవుంది" అని గొణుక్కొని చేతిగుడ్డతో మొహం తుడుచుకు న్నాడు. విశ్వప్రయత్నంచేసి మనసును. పనిమీద లగ్నం చేసాడేకానీ ప్రయోజనం లేకపోయింది

ఈ సి.ఐ డి. ఇక్కడ ఎందుకున్నాడు? ఇన్నిరోజులు ఊరికేవుండి ఇప్పుడెందుకు వచ్చాడు? నిస్సందేహంగా తను తస్కరించిన డబ్బుకోసం .కూపితీయడానికే ఈ సి ఐ డి. వచ్చివుంటాడు; తన మీద సందేహం ఏర్పడింది కాబోలు . తన మీద సందేహం ఏర్పడకపోతే వేరే ఎందుకా సి. ఐ. డి ఆక్కడ కూచుని తననే దొంగ చూపులు చూస్తాడు? ఇలాంటి యక్ష ప్రశ్నలతో సుందరం తల వేడెక్కి పోయింది.

ఆ రోజు సాయంకాలం సుందరం ఇంటికి పోగానే స్వర్ణ భర్తను చూసి "ఈ రోజు మీరు ఒక మాదిరిగా వున్నారు ... మొఖంకూడా చాలా వాడిపోయివుంది. ఒంట్లో బాగలేదా?" అంది

"అబ్బే ఏమీలేదు స్వర్ణా...ఆఫీసులో పని అధికం అందుకే కొంచెం అలసటగావుంది ..."

మరునటి రోజు సుందరం బ్యాంకుకు పోయేముందు ఈ రోజు ఆ సి. ఐ. డి. వ్యక్తి అక్కడలేకుండావుంటే ఏ అపాయమూ లేదు; ఈ రోజు ఆ సి. ఐ. డి. అక్కడ వుండడు. తనే అనవసరంగా భయపడుతున్నాడు. ఆ సి ఐ. డి. అక్కడవుంటే మాత్రం భయమేమిటి? వేరే పనిమీద వచ్చివుండకూడదా ? సిటీలో పనివుండి ఎంతమందో ఆఫీసర్లు ఈ పెద్ద హోటల్లో బసచేస్తారు; అలాగే ఈ సి. ఐ డి. కూడా తను ఎందుకు భయపడాలి? తను ఈ రోజు ఆ హోటల్ గదులవైపు వరండావైపు చూడనేకూడదు. సుందరం తనకుతానే సమాధాన పర్చుకొని మనసు దృఢపర్చుకొని తన సీటులో పోయి కూలబడ్డాడు

ఏదో వ్రాస్తూ అనాలోచితంగా సుందరం హోటల్ వరండావైపు చూసాడు. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు తన ఎదురుగా వరండాలో ఆ సి. ఐ డి. వ్యక్తిలేడు అబ్బ బ్రతికిపోయాను! అనవసరంగా ఆలోచనలు అనవసరంగా భయంతో అశాంతి చెలరేగింది. నేరంచేసిన వ్యక్తికి భయం అనే పెద్దల వాక్యము నిజమే అయింది. ఈ జన్మలో దొంగతనం ఏ పరిస్థితుల్లోకాని చేయకూడదు

మేనేజింగ్ డైరక్టర్ కార్ బ్యాంకి ముందు వచ్చి నిలబడింది. ఆయన తన గదిలోకి పోయిన పది నిమిషాలకంతా సుందరం అలవాటుప్రకారం హోటల్ వరండావైపు చూసాడు; మళ్ళీ మామూలుగా సి ఐ డి. వ్యక్తి తన స్థానంలోంచి పుస్తకం చదువుతున్నట్లు నటించే దృశ్యం చూసి సుందరం పిడుగుపడినట్లు అదిరిపడ్డాడు. తల తిరిగిపోయింది; శరీరం వణుకుతోపాటు ముచ్చెమటలు పోసాయి.

మేనేజింగ్ డైరెక్టర్‌గారికోరిక మీదనే ఈ సి. ఐ. డి. వచ్చివుంటాడు. సి. ఐ. డి కి తన సందేహాన్ని అభిప్రాయాన్ని తెలియబరిచి వుంటాడు. మేనేజింగ్ డైరెక్టరు సి, ఐ, డి. కి ఏం చెప్పాడో ఏమో? ఒకవేళ అరెస్టు చేసేందుకు తీర్మానించి వుంటారేమో? సుందరం భీతిల్లిపోయాడు.

ఇద్దరు పోలీసులు తనచేతికి బేడీలు తగిలించి వీధిగుండా నడిపించుకుపోయే దృశ్యం సుందరం మనసులో కల్పితం చేసుకొన్నాడు ఆ దృశ్యాన్ని తనస్వర్ణ చూస్తే...? వేదనతో బాధగా మూలిగాడు

పోలీసులు బేడీలతోసహా తనకోసం వస్తారని ప్రతిక్షణం ఎదురు చూస్తూనే వున్నాడు సుందరం. హోటల్ వరండా వైపుచూడకూడదని పళ్ళుకొరుక్కొని ఓపిగ్గా కూచున్నాడు. ఇంకా ఆ సి. ఐ డి. వరండాలో నే తననే 'నోట్' చేస్తున్నట్లు, లోతుగా, తరచి చూసే అతని మొఖం, ఆకారం, అన్ని సుందరం మనోనేత్రాలుచూస్తూనేవున్నాయి.

సాయంకాలం బ్యాంకిమూసే వరకు తనుఎదురుచూసినట్లు ఏమీజరగలేదు తనపై వట్టి సందేహం మాత్రమేకలిగివుంటుంది తను దొంగ అనేందుకు తగిన ఆధారం వారికి దొరికి వుండదు అందుకే అరెస్టుచేయలేదు. తను దొంగతనం చేసినట్లు వాళ్ళకు సాక్షి ఎవరున్నారు? ఆధారం ఏముంది? ఓ ...ఒకవేళ తను బంగారు వడ్డాణం కొన్నవిషయం తెలిసిపోతే ఎలా? అని ఆలోచన రాగానే సుందరం భయంతో వణికిపోయాడు

ఆరోజు సాయంకాలం సుందరం గబగబా ఇంటికి బయలుదేరి "స్వర్ణ నీవు బంగారు వడ్డాణం కొన్నట్లు చుట్టుపక్కల కుటుంబాలకు అప్పుడే తెలుసనుకుంటాను నిజమేకదా?" అని అడిగాడు.

"మీ వరస బాగానేవుంది ! వడ్డాణం తీసుకొనిఇంటి ఇంటికిపోయి. చెప్పివచ్చేటంత పిచ్చిదాన్ననుకున్నారా నన్ను? పక్కింటి వదినగారు వడ్డాణం చూసి "అరె! బంగారంలాగే వుందే" అని ఆశ్చర్య పడ్డప్పుడుకూడా నేను నిజాన్ని చెప్పలేదు.

(ముగింపు వచ్చేసంచికలో)

# సర్వోదయ తత్వము

'Unto this last' అను ఆంగ్ల గ్రంథమును రచించినది ప్రఖ్యాత ఆంగ్ల రచయిత ఆధ్యాత్మిక తత్వవేత్తయైన 'జాన్‌రస్కిన్' మహాశయుడు. ఈ వుత్తమ గ్రంధము, మహాత్మాగాంధీ మనస్సులో అంతర్గతమై యున్న భావపరంపరలకు, ఆశయములకు రూపు రేఖలను దిద్ది, నిత్యసత్యవ్రత సర్వజన శ్రేయోదాయకమైన జీవితపథమునకు ధృవతారయైనది. మహాత్ముడు ఆత్మకథలో "నా జీవితమును క్రియా పూర్వకముగా మార్పు చేయించినదీ గ్రంథమే" నని వ్రాశారు. ఈ గ్రంథమును గాంధీజీ "సర్వోదయ" మను పేరుతో గుజరాతీ భాషలోనికి అనువదించారు.

"సర్వేఃజనాః స్సుఖినోభవంతు" అన్నట్లు సర్వమానవ శ్రేయస్సే సర్వోదయము. ఆనాడే దేశములో నిజమైన ప్రజాస్వామ్య రాజ్యము స్థాపింపబడుతుంది.

సర్వమానవ శ్రేయస్సులోనే తన శ్రేయస్సు కలదని ప్రతిమానవుడు గుర్తించాలి.

మేధస్సుతో కూడినపనికి, శరీరశ్రమతో కూడిన పనియేమాత్రము హీనమైనదికాదని తెలుసుకోవాలి.

జీవనమునకు అతి ముఖ్యమైన వానిలో నొకటైన ఆహారమును వుత్పత్తి చేయుటకు తోడ్పడువారు కాబట్టి, కర్షకుల జీవితం వుత్తమమైనదని పరిగణించాలి.

ఇవి సర్వోదయమునకు ముఖ్యమైన అంశములు

ధర్మాన్ని, న్యాయాన్ని పాటిస్తూ సత్ప్రవర్తనుడై పొరుగువారికి న్యాయం కలుగ చేయటంలో మానవునకు సౌఖ్యము, దేశమునకు సౌభాగ్యము యిమిడివున్నది. ఉదార మనస్కులు ఆనంద భరితాంతఃకరణులునైన ప్రజలు యే దేశంలో యెక్కువగా పుట్టి పెరుగుతారో అక్కడే దేశసౌభాగ్యము, మానవ సౌఖ్యము ప్రతిష్టింప బడుతుంది, జాతి, మత, కుల, వర్గ భేదములను మటుమాయంచేసి, సర్వమానవులను ప్రేమాభిమానములతో పెనవేయగల సూత్రమే సర్వోదయము.

సర్వమానవ శ్రేయస్సు ధ్యేయముగా నున్న యీ పథకమునకు సత్యాహింసలు మూలసూత్రములు. ఈ రెంటిని గాంధీజీ దైవ సమానముగా భావించి, జీవితయాత్ర గడిపి ధన్యులయినవారు. మహాత్ముని నిర్యాణానంతరము ఆయన ముఖ్య శిష్యులు, స్నేహితులు గాంధిజీకి అత్యంతప్రియమైన మూల సూత్రములను ప్రజలకుబోధించి నిర్మాణాత్మక కార్యక్రమాలను నడుపుటకు సాధనముగా స్థాపించిన సంస్థ సర్వోదయ సమాజము.

ఈ సమాజము కేవలము ప్రచారము కొఱకు స్థాపించబడిన సంస్థకాదు ఇందు రాజకీయముల ప్రసక్తి లేదు. ప్రపంచములోని యితర సంస్థలవలె సభ్యత్వరుసుము, ఒకరి అనుమతి బడిసి సభ్యులుగా యెన్నుకొన బడుట, మొదలైన నిబంధనలులేవు. చట్టబద్ధమైన నిబంధనలు కాక, సాంస్కృతిక బద్ధమైన నిబంధనలతో కూడిన ప్రణాళిక సర్వోదయము.

ఎవ్వరూకూడ అవకాశమున్నదికదాయని యెదుటివారిని అణగద్రొక్కి తమ స్వప్రయోజనాలను సాధించుకొనరాదు. ఇతరుల అవసరాలను గుర్తించాలి తమ అవసరాలను పూర్తి చేసుకొనుటకు యితరులను యిబ్బంది పెట్టకూడదు. స్వయంకృషితో జీవించాలి మానవులనందరినీ తన సహోదరులుగా భావించాలి గృహస్త జీవితంలోనేకాక, వర్తక,వ్యాపార, పుద్యోగ క్షేత్రములలోకూడ సత్యాహింసలను పాటించాలి. శరీరశ్రమ, అపరిగ్రహము పాటించిననాడు, యిట్టి నైతికవిలువలపై ఆధారపడిననిబంధనావళి సాధ్యము కాగలదు. ఇట్టివారు సర్వోదయ సమాజ సభ్యత్వమునకు అర్హులు. సూక్ష్మంగా చెప్పినట్లైయితే — ఎవరు గాంధీజీ స్థాపించిన సత్యాహింసలతో కూడిన నిర్మాణాత్మక కార్య క్రమములను మనస్ఫూర్తిగా పాటిస్తారో వారందరూ సర్వోదయ సమాజ సభ్యులు కాగలరు.

ఆధునిక యుగంలో సాంస్కృతిక విలువలకు స్థానం క్రమంగా తగ్గుచున్నట్లు తెలుస్తోంది. దీని స్థానమును ఐహిక సంపద ఆక్రమించు కొనుచున్నది. ఆర్థిక సమృద్ధితో గలిగిన యీ ఐహిక సంపద, భోగభాగ్యముల మీద, మానవశ్రేయస్సు ఆధారపడి వున్నదన్న పరిభాష సమంజస మైనది కాదు, ఆత్మ సంస్కృతిగల శ్రేయస్సే నిజమైనది. స్థిరమైనది కాబట్టి సర్వోదయ సమాజ సభ్యులు క్రమంగా సంఘంలో మార్పు తీసుకు రాదగిన ప్రణాళికను తయారు చేసినారు సర్వమానవ శ్రేయస్సు గమ్యమైన యీ పథమునకు, అనుసరణ మార్గము కూడ ఆ సంస్కృతికి తగినదిగా నుండాలి కదా. కనుక చట్టరీత్యా నిర్బంధ పఱచికాని, విద్రోహ మార్గమును కాని అనుసరించక, సత్యాహింసల మార్గములో క్రమముగా మానవుల అంతఃకరణలలో పరివర్తనము తీసుకు రా తలచారు.

బేసిక్ విద్యా విధానము, చేతి పరిశ్రమలు, మద్యపాననిషేధము. జాతిభేదములను పాటింప కుండుట, హరిజన? ఆదివాసుల వుద్ధరణ, వికలాంగుల రోగుల, యొక్క సేవ, ఖద్దరు పరిశ్రమ మొదలైన నిర్మాణ కార్యక్రమములు యీ సర్వోదయ శిఖరా రోహణకు సోపానములు.

మానవులు స్వశక్తిపై ఆధారపడి జీవించాలి తమ తమ హక్కులనుగాక బాధ్యతలను ముందు గుర్తించి నడుచుకోవాలి మనిషి తనబాధ్యతలను నిర్వహించిన నాడే హక్కులకు అర్హుడని తెలుసుకోవాలి. బేసిక్ విద్యా విధానం వల్ల యే పనినైనా గౌరవించగల దృక్పథము యేర్పడుతుంది. చేతి పరిశ్రమలద్వారా అనేక కుటుంబాలకు స్వయం పోషకత్వం యేర్పడుతుంది ముఖ్యంగా ఖద్దరు పరిశ్రమలో ప్రస్తుతం అములులో నున్న "అంభర్ చర్కా" అనేకులకు జీవనోపాధి కలుగజేస్తోంది మద్యపాన నిషేధం కుటుంబాల ఆర్థికస్థితి చక్కచేయటమేకాక వారిని ఆయురారోగ్యవంతులుగా చేస్తుంది. ఈ విధంగా గాంధీజి ప్రభోధించిన ప్రతి ఒక్క కార్యక్రమాన్ని అవలంభించుటకు సర్వోదయ సమాజ సభ్యులు కంకణం కట్టుకోవాలి. వ్యక్తిగతంగా కాని, సమూహంగాకాని, సంస్థద్వారాకాని, యే విధంగానైనా యీ కార్యక్రమాలను పాటించిన వారందరూ సర్వోదయ సభ్యులు.

భారత భూమిలో వ్యవసాయము ముఖ్యవృత్తి కనుక, గ్రామీణుల సంఖ్య అధికము- కానీ వారికే సౌకర్యములు అతి స్వల్పము. కాబట్టి యీ కార్యక్రమములు గ్రామాలలో ప్రారంభింపబడినవి. సంవత్సరమున ఒకమారు సభ్యులందరూ సమావేశమై- తామింత వఱకు చేసిన పనిని గూర్చి చర్చించి, యిక ముందు చేయవలసిన పనిని యేర్పాటు చేసుకొని, అభివృద్ది కార్యక్రమాలు ఆలోచిస్తారు. ఈవుద్యమము యిప్పుడు అమలు జరుప బడుచున్నదని అనుట కంటే, పునర్నిర్మింప బడు చున్నదంటే సమంజసమేమో.

కారణం మనదేశంలో పూర్వము గ్రామపంచాయితీలుండినవి. గ్రామ పరిశ్రమలకు యే కొఱతలేదు. ప్రతిగ్రామము స్వయం పోషకమన్నా అతిశయోక్తి కాజాలదు ఇక గ్రామ పెద్దల యెదుట చిన్న చిన్న తగాదాలేగాక ఆస్తి హక్కులకు సంబంధించిన ఫిర్యాదులుకూడ పరిష్కరింపబడేవి. నిత్యజీవనానికి అవసరమయ్యే ప్రతి వస్తువు గ్రామంలోనే వుత్పత్తి అయ్యేది. గ్రామపెద్ద ఫిర్యాదులకు తీర్పుచెప్పినా వైద్యుడు చికిత్సచేసినా స్వలాభంకాక గ్రామీణుల అభివృద్ధిని కాంక్షించేవారు, ఒకరి కొకరు సహాయపడుచు ఒకరి మంచిచెడ్డల కింకొకరు ఆనుకుంటూ సమిష్టికుటుంము లాగ వ్యవహరించేవారు ఏపని యెవరు చేసినా ఆత్మీయత గోచరించేది

శతాబ్దాల విదేశ పరిపాలనలో భారతదేశపు ఔన్నత్యము సంస్కృతి క్రమంగా మటుమాయమైనది. పాశ్చాత్య నాగరిక ప్రభావం వల్లనైతేనేమి, భారతీయుల మనోదౌర్బల్యమైతేనేమి, హేతువేదైనారాను రాను భారతీయులకు పాశ్చాత్యులు అనుకరణీయులైనారు అనాదిగా వస్తున్న భారతీయ విధులను వదలి ప్రజలు పాశ్చాత్య పద్ధతులకు ఆకృష్టులైనారు పదవు

---

## శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మ

---

లని వుద్యోగములని పట్టణములకు చేరుకున్నారు. అందువలన భూసంపద, గోసంపద దిగజారినది. భారతీయ పరిశ్రమలుకూడ వెనుక బడ్డవి

ఈ నాడు భారతీయ సంస్కృతికి ఆలవాలమైన ఆచారములను, పద్ధతులను ప్రజలకు బోధించి, పునరుద్ధరించ వలసిన సమయం యేర్పడింది. ఆ ప్రణాళికనే సర్వోదయ సమాజము ద్వారా అమలు జరుప వలసి వున్నది. భారత్ సేవక్ సమాజ్ కూడ సర్వోదయ ప్రణాళికా బద్ధమైన కార్యక్రమాన్నే జరుపుచున్నది. దేశవ్యాప్తము చేసి మానవులలో మార్పు తీసుకొని రావడమన్నది సులభసాధ్యమైన పనికాదు. ఇందుకు అనంత సహనము, నిర్విరామ కృషి, నిర్వికల్ప అభిమానము కావలెను అంతే కాక చరిత్ర ద్వారా గతాన్ని కూలంకషంగా చదివి, వర్తమానాన్ని అర్థం చేసుకొని, భవిష్యత్తుకు గ్గాపు దిద్ద గల సామర్థ్యము అలవఱచుకొన వలెను. స్వశక్తిపై నమ్మకము, ధైర్య స్థైర్యములు గలిగి ముందడుగు వేసిన వారు తప్పక గమ్యస్థానము చేరగలరు

సర్వోదయ సమాజమును నెలకొల్పి 15 సంవత్సరములు నిండినవి ఈ వ్యవధిలో జరిపిన కృషి తక్కువైనది కాదు. హరి జనులకు. గిరిజనులకు ఆదివాసులకు అనేక సౌకర్యములు కలిగినవి. అంబర్ చర్ఖా రాకతో ఖద్దరు పరిశ్రమ వృద్ధి పొందింది శ్రమదానోద్యమము ద్వారా గ్రామోద్ధరణకు అవకాశం కలిగింది అన్నిటి కన్నా ముఖ్యమైనది భూదానోద్యమము. ఈ వుద్యమము ద్వారా నిరాడంబర క్రమబద్ధ సాంఘికపరిణామము యేర్పడుటకు అవకాశ మున్నది.

సర్వోదయ ఆశయము మహోన్నతమైనది దీని విజయముసాధ్యమేనా అన్న సందేహముకూడ కలుగుతుంది. ఎవరెస్టుశిఖరారోహణమువలె యే నాటికైనా సాధ్యమే అయిన పక్షంలో ఆనాడు భూతల స్వర్గమే సృష్టింప బడుతుంది. పరిపూర్ణ విజయము కాక, కొంతవఱకు సాధించ గలిగినా శ్రేయస్కరమే.

★

---

## కృతజ్ఞత

ఆంధ్ర మహిళాసభ టూరిస్ట్‌హాస్టల్ ప్రారంభోత్సవానికి విచ్చేసిన సాంగ్లీరాజ దంపతులు, టూరిస్ట్‌హాస్టలులోని కొన్ని రూములకు వలయు ఫర్నిచరు కొనడానికి విరాళ మివ్వగలమని వాగ్దానం చేశారు. ఆ వాగ్దాన పురస్కారంగా 5000 రు. అయిదువేల రూపాయలు మొదటి తడవగా పంపినారు. ఈ విరాళాన్ని శ్రీరాణి వారి ఆదేశ ప్రకారం టూరిస్ట్‌హాస్టల్ ఫర్నిచర్ ఖరీదు చెయ్యడానికి వుపయోగించనున్నాము. ఈ సందర్భంలో శ్రీరాణివారికి ఆంధ్ర మహిళా సభ కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నది.

డాక్టర్. శ్రీ. ఎ. వి. సుబ్బారావుగారు 100 రు. మచిలీపట్నమునకు చెందిన శ్రీయుత కె.ఎ. రామకృష్ణ గారు ఆంధ్ర మహిళాసభ టూరిస్ట్ హాస్టల్ ఫర్నిచర్ నిమిత్తము 800 రు. ఎనిమిది వందల రూపాయలూ, మెస్సర్స్ శంభులాల్ అండ్‌కంపెని రెండువందల యాభై రూపాయలూ హైద్రాబాద్‌లోని మా ఆంధ్ర మహిళాసభకి విరాళముగా నొసగిరి. వీరందరికీ మా కృతజ్ఞత.



# FAMILY PLANNING CLINIC.

NO: 93. V. V............R/U  Date: 6-2-1964.

Return for the month of January 1964.

Address of Clinic: Andhra Mahila Sabha Nursing Home& Free Dispensary,
No: 3, Adyar Bridge Road, Madras-28.

| | Upto the end of previous month. | During month under review. |
|---|---|---|
| Population served by the Clinic :— | | |
| 1. Persons contacted for F.P. education. | 23,687 | 250 |
| 2. No. of cases given advice: | 1,234 | 14 |
| 3. No of active cases following F,P. methods: | 602 | 616 |
| 4. Clinic attendance: | 36,136 | 320 |
| 5. No. of persons visited at home for :— | — | — |
| (i) new contacts: | 10,695 | 125 |
| XX (ii) follow-up. | 7,166 | 220 |
| Cost of Contraceptives (in Rs.) supplied by the Clinic.— | Rs. nP | Rs. nP. |
| 6. Free. | 6669-88 | 113-02 |
| 7. At half rates. | 210-24 | 2-06 |
| 8. At full rates. | 202-95 | 3-34 |
| 9 Total: | 7083-07 | 118-42 |
| Sterlization cases referred to Hospital :— | | |
| 10. Male | 253 | 3 |
| 11. Female. | 498 | 4 |
| 12. Total. | 751 | 7 |
| Nature of advice given: (Give No. of cases) | | |
| 13. Diaphragm and Jelly. | 250 | 9 |
| 14. Jelly alone. | 290 | 5 |
| 15. Sheath. | — | — |
| 16 Safe period: | — | — |
| 17. Foam Tablets. | 62 | — |
| 18 Others (specify)— | | |
| 19 Total | — | — |
| Meetings: | General | Group |
| 20 No. held. | 71 | 80 |
| 21 No of persons attended. | 32 | 16 |

Signature of Medical officer I/C. (Sd) Dr. C Kamaladevi.

(11 పేజీ తరువాయి)

బుద్ధుని శిరముపై బుష్పముల వర్షించుచున్నారు. ఈ దేవతా ప్రతిమలు యత్యద్భుతముగనున్నవి. తక్షశిలయందు లభ్యమైన గాంధార శిల్పము లన్నిటి యందును మేటిగ పరిగణింప బడినదీ శిల్పరాజము.

శిర్సుఖ్ సమీప మందలి నాల్గుసుప్రసిద్ధ బౌద్ధ నిలయములను హుయన్ త్సాంగు వర్ణించి యున్నాడు. వానిలో మొదటిది రాక్షసరాజైన యేలాపుత్రుని తటాకము. ఇది ప్రస్తుతము హసన్ అబ్దాల్‌లో పంజాసాహెబ్ యనబడు చున్నది. రెండవది స్తూపము. ఇది మైత్రేయుడు బుద్ధుడుగ నవతరించినపుడు స్థావరమై యుండు నాల్గు నిక్షేప ములలో నొకటి వీనిని-గాంధారములో యేలా పత్ర, మిధిలలో పండూక, కళింగములో పింగళ, కాశీరాజ్యములో శంక యని బుద్ధుడు జెప్పి యున్నాడు. మూడవదైన భల్లార్ స్తూపములను రాజధానికి వుత్తరముగ 12Li దూరాన అశోకుడు, బుద్ధునిశిరోదాన స్మారకార్థము నిర్మించెను. చివరిదైన కుణాలస్తూపమును అశోకుడు కుణాళుని చక్షువుల బెరికిన స్థానమున గట్టించెను కుణాల స్తూపము హాథియాల్ వుత్తరపు చరియలపై నున్నది. ఇచటి నుండి హారోలోయ యంతయును, సిర్కాపు పురమంతయును గానవచ్చు చున్నది. స్తూపము 100 అడుగుల యెత్తుగల్గి, తక్షశిలకు నాగ్నేయ దిశగనున్నది. ఇచట ఆంధ్రులు ప్రార్ధనల సల్పిదృష్టిని బొందు చుండిరని హుయన్ త్సాంగ్ వ్రాసియున్నాడు. చరిత్రాత్మక మైన కుణాలు గాధ హృదయ విదారకము గదా! అశోకుని కడగొట్టురాణి యైన తిష్యరక్షిత సవతి బిడ్డడైన కుణాలుని మోహించి, మహారాజు వానిని తక్ష శిలకు రాజప్రతి నిధిగ బంపునట్లు ప్రేరేపించెను! తదుపరి భర్త పేరున కమ్మవ్రాసి, రాజు నిద్రించు చుండగా, వాని దండముల ముద్ర దానిపై ముద్రించి, కుణాలునిపై నేరముల మోపినేత్రముల బెరుక నాజ్ఞ బంపెను; రాజాజ్ఞను పాలింప మంత్రులు జంకుచుండ కుణాలుడు తానే వారిని తమ బాధ్యతను నిర్వహింప ప్రోత్సహించెనట. తదుపరి యంధుడైన కుణాలుడు భార్య కాంచన మాలతో వేణువూదుచు తిరిపమెత్తు కొనుచు తిరిగి తిరిగి అశోకుని రాజధాని చేరుకొనగా అశోకుడుకుమారుని కంఠధ్వనిని, వేణుగానమును గుర్తించి తిష్యరక్షితకు మరణశిక్ష విధించెను. బౌద్ధబిక్షుణి ఘూషాసహాయముతో బుద్ధగయలో కుణాలు చక్షువుల గాంచెనట. కుణాలుని మొదటి నామము ధర్మ వివర్ధనుడట. కాబట్టియే సార్ధకి నామధేయుడై పితృయాజ్ఞకు లొంగి కన్నుల బోగొట్టుకొనెనా? హిమాలయము లం దుండు కునాలపక్షివలె చిన్న మనోజ్ఞమైన నేత్ర ములు గల్గియున్నందున అశోకుడు పుత్రునిప్రేమ తోకునాలుడని బిల్చువాడట. పూర్వజన్మమున కుణాలుడు 500 మృగములను, అర్హతులను అం ధుల జేసి, చైత్యములను శిధిలపర్చెననియు, తత్ఫ లితముగ నీ జన్మమున నంధుడయ్యెనని బౌద్ధ గ్రంధములు జెప్పుచున్నవి.

కుణాలస్తూపము సమకోణ చతురస్రాకారపు ప్రాతిపదికపై నిర్మింపపడినది, ఇది తూర్పునుండి పశ్చిమమునకు 63'9,'' వుత్తరమునుండి దక్షిణ మునకు 105' కొలతలు గల్గియున్నది. ఇది 3 అంతస్తులుగనున్నది. స్తూపము 3 వ లేక 4 వశ॥ యందు నిర్మింపబడి, లోయకు అవతలవైపున నున్న భల్లరు స్తూపమునకు సమకాలికమైయు న్నది. కుణాల స్తూపమునకు దిగువను సిధియో పార్ధియనులనాటి మరొకచిన్న స్తూపముగలదు. ఎగువను ఘనమైన సంఘారామము కలదు; దీని కుడ్యములు 14' ఎత్తుగల్గియున్నవి. వుత్తరమున 155' విస్తృతిగల చతుశ్శాలయు, దక్షిణమున హాలునుగలవు. వీని చుట్టుకొనియున్న బాహ్య కుడ్యపు నిడివి 197' ఇంకను యెన్నియో కళా ఖండములు తక్షశిలా పరిసరముల నున్నవి.

చారిత్రకముగ తక్షశిలా ప్రాంతమున క్రీ.పూ 5 వ శ॥ న పారశీక Achamanid సామ్రాజ్యములలో నంతర్భాగమై యుండెను. డరియాసు మహారాజు శాసనములు హైందవరాష్ట్రములో జేరియున్న గాంధార రాష్ట్రము, సామ్రాజ్యమంతటి యందును సంపన్నమై జనసాంద్రత గల్గి యుండెనని జెప్పుచున్నవి. క్రీ. పూ. 3 వ శ॥ నాటి పారశీక శాసనము లిచటగలవు. అలగ్జాండరు దండయాత్రకాలమున తక్షశిల అధినాధుడు అంభి మహారాజు. వీనిని గ్రీకు చరిత్రకారులు Ompbisis అనియు Texiles అనియు బిల్చియున్నారు. ఇతడు జీలంకు యావలితటమందున్న పౌరవరాజైన పురుషోత్తముని Porus తోడను, పరిసరముల పర్వతరాజైన అభిసారుని తోడను వైషమ్యములు గల్గియుండెను. ఇతని రాజ్యము సింధునదినుండి Hydaspes వరకు వ్యాపించి పట్టణములతోను, అశేష జనానీకముతోను, దిట్టమై పరిపాలనా సౌకర్యములతోను సౌభాగ్యవంతమై యున్నదని గ్రీకు రచయితలు వ్రాసియున్నారు. క్రీ. శ. 326 సం॥ లో అలగ్జాండరు సహాయ మపేక్షింపుచు అంభి స్వయముగా యుద్భాండము యొద్ద విడిసిన అలగ్జాండరుకు రాయబారమంపెను. సైన్యముల సమర్పించెను; రాజధానియందు, యాతిథ్యమిచ్చెను. తత్ఫలితముగ అంభి అలగ్జాండరునుండి నూతన రాష్ట్రముల బొందెను; పోరసుతో సమాధానము జరిగెను. అలగ్జాండరు మరణించిన (క్రీ. పూ. 323) 6 సం॥ లకే చంద్రగుప్తమౌర్యుడు సింధు నదికి తూర్పున నున్న గ్రీకుసైన్యముల దరిమి తక్షశిలా ప్రాంతములను మగధసామ్రాజ్యములో జేర్చెను. మౌర్యపరిపాలన నచ్చక చంద్రగుప్తుడు మరణింపగానే పంజాబు రాజ్యములు తిరుగ బడెను; అనగా బిందుసారుని రాజ్యకాలమున తక్షశిల మౌర్యుల క్రిందలేదు. కాని అశోకుడు యువరాజుగ నున్నపుడు దీని జయించి నచటరాజప్రతినిధిగ నుండెను. అశోకుని రాజ్యకాలమున కుణాలుడు తక్షశిలలో రాజప్రతినిధిగ నుండెను. అశోకుని మరణానంతరము (క్రీ. శ 231)సామ్రాజ్యసరిహద్దురాష్ట్రమైన తక్షశిల స్వతంత్రమై బాక్ట్రియను గ్రీకుల వశమయ్యెను.

తక్షశిలా ప్రాంతముల గ్రీకుల పాలనయొక శతాబ్దమునకు మించిసాగెను. తర్వాత పశ్చిమమునుండి సిధియనులు, శకులు గాంధారమును నాక్రమించిరి; పంజాబును జయించిరి. శకరాజు Manes క్రీ. పూ. 80 ప్రాంతమున తక్షశిల రాజును యోడించెను. క్రీ. పూ. 58 సం॥ ప్రాంతమున శకరాజు Azes I భారతదేశపు వాయవ్యభాగమున యమునా తీరము వరకును శకరాజ్యమును వ్యాపింపజేసెను. అప్పటికే పంజాబులో స్థిరపడిన పారశీక పరిపాలనా విధానమును అమలుపర్చెను. క్రి. శ. 30 సం॥ నాటికి తక్షశిలా రాజ్యము పార్థియనుల వశమయ్యెను. పార్థియను రాజు కుషానులనుండీ కాబూలు లోయను వశపర్చుకొనెను; కాని పార్థియను సామ్రాజ్యము Gandaphernes మరణముతో విచ్ఛిన్నమై పోయెను. తక్షశిలలో Sasas, Sapedana, శతవస్త్రరాజుల నాణెములు లభ్యమైనవి. పార్థియను రాచరికమును సిర్ఖాపులో లభించిన పురాతన వస్తువులు. కట్టడములు నిరూపించు చున్నవి. ఆ కాలమున క్రి. శ. 44 సం॥ ప్రాంతమున Apolonius of Tyana తక్షశిలను దర్శించెను; జాండియాల్ దేవాలయమునుగాంచెను. సిర్కాప్ Ninevah అంత విస్తృతి గల్గియున్నదనియు, ఏథెన్సు పట్నములోవలె వీధులు యిరుకుగను, వక్రముగను యుండెననియు, గృహములు ఒక్క అంతస్థుగలవై భూమిలోనికి గదులు గల్గియుండెననియు, పట్టణములోపల మార్తాండ దేవాలయము. రాజభవనము నుండెనని వర్ణించియున్నాడు.

ఇండో పార్థియను సామ్రాజ్యము విచ్ఛిన్నముకాగా, కుషానులుకాబూలులోయను, ఆఫ్ఘనిస్థానమును, గాంధారమును నాక్రమించిరి క్రీ. శ

60 సం॥ నకు 64 సం॥ నకు మధ్య కాలమున కుజలు Kadphises మహారాజు తక్షశిలనుపార్థి యనుల నుండి వశపర్చుకొనెను. తర్వాత తక్ష శిల వీమాKadphises II కనిష్కుని రాజ్య ములో గలిసి యుండెను. కుషాను సామ్రాజ్యము. సెస్సానియను దండయాత్రల ఫలితముగ పతన మయ్యెను. తక్షశిలలో సెస్సాని యనుల నాణె ములు యెన్నో లభించినవి. అటుపిమ్మట 5 వ శ॥ లో క్రీ. శ. 455 స॥ నకు తర్వాత శ్వేత హూణులు తక్షశిలలోని యెన్నో కట్టడములను నిర్మూలించిరి. నిజమునకు యీ దెబ్బనుండి తక్ష శిలమరల కోలు కొనలేదు.

7వ శ॥ లో హుయన్ త్సాంగ్ కాలమున తక్షశిల కాశ్మీర రాజ్యమునకు పరాధీనమై యుండెను; సామంత ప్రభువులు పరస్పరము వైష మ్యములతో. పోరాటములు సల్పుచుండిరి; సం ఘారామములు నిర్మానుష్యమై, శిథిలములై పాడుపడి యుండెను. ఇదియే తక్షశిలా చరిత్ర మున చరమదశ. ఇంతటి నుండి భారత చరిత్ర మున తక్షశిలా ప్రశంస మరుగుపడి యున్నది.

సహస్ర అయనములు సకల ప్రాముఖ్యమును, సర్వ సంపదలను, మహోన్నత వైభవమును, కీర్తి, కల్యాణముల నను భవించిన తక్షశిలా నగరము, యీ నాడు నామమాత్రా వశిష్టమై యున్నది.

★

---

# ఓణం

భిన్నత్వంలో ఏకత్వాన్నీ, ఏకత్వంలో భిన్నత్వాన్నీ చూపించే మన దేశంలో ఏన్నో భాషలు మాట్లాడేవారు, ఎన్నో జాతులవారు, ఎన్నో తెగలు ఎన్నో మతాలవారు కలరు పూర్వం 'బి' తరగతి రాష్ట్రంగా యుండి 'రాజ్ ప్రముఖ్'చేత పరిపాలింపబడెడి ట్రావెన్‌కోర్ కొచ్చిన్ రాష్ట్రం నేడు భాషా ప్రయుక్తంగా విభజించ బడిన తరువాత 'కేరళగా' వ్యవహరింపబడుతోంది. ఈ రాష్ట్రం ట్రావెన్‌కూర్ కొచ్చిన్, మలబారు కలసి కేరళగా వ్యవహరింపబడుతోంది. కేరళ నారికేళాలకి పుట్టినిల్లు మన కోనసీమవలెనే మన దేశాలలో గల రాష్ట్రాలలో ఇది చాలా చిన్నది.

ఈ రాష్ట్రానికి చరిత్రాత్మికమయిన కథ ఉంది. పూర్వం పరశురాముడు గోకర్ణంనుంచి గండ్ర గొడ్డలిని విసిరాడనీ అది కన్యాకుమారి వద్దపడి ఆ సముద్రం చీలి అక్కడి భూమి పైకి వచ్చిందనీ అదే నేటి మళయాళ దేశమనీ చెప్తారు. ఈ భూమినే భార్గవరాముడు క్షత్రియ నాశనానికి పాప పరిహారంగా బ్రాహ్మణుల కిచ్చాడనీ అదే మళయాళ దేశమనీ, నేటి కేరళ అనీ అంటారు

కేరళరాష్ట్రంయొక్క వైశాల్యము 15,000 చ మైళ్ళు ఇది చాలా చిన్న రాష్ట్రం ఇందు చెట్లు, పర్వతాలు, కొండలు, నదులు, చూడముచ్చటగా యుంటాయి దీని జనాభా 1 5 కోట్లు. దీనిలో 9 జిల్లాలు మాత్రంయున్నాయి. ఇక్కడ హిందువులు క్రిష్టియనులు, ముస్లిములు ఉన్నారు హిందువులలో తిరిగి నాయర్లు, ఎజహవాసులు, పులయాసులు, ఉల్లదాసులు, బ్రాహ్మణులు ఉన్నారు. ఇంకా వెనుకబడిన జాతులుగూడా ఉన్నాయి అందరూ గూడా మతమనినా, భగవంతుడనినా నమ్మకం కలిగి నవారే.

కేరళలో చాల చరిత్రాత్మికమయిన దేవాలయాలు, చర్చిలు ఉన్నవి అనేకమంది వీనిని చూచుటకు వస్తూ ఉంటారు త్రివేంద్రంలో గల పద్మనాభస్వామి దేవాలయము, గురవయూరులోని ఉన్నిక్రిష్ణ దేవాలయమును శబరిమలాయి అయ్యప్పస్వామి దేవాలయము, వైకామ్ లోని శివుని దేవాలయము. కేరళలి ని గొప్ప దేవాలయములు, కేరళకు రాజధాని త్రివేంద్రం. దీనినే దక్షిణ దేశపు వుద్యానవనమని అన్నారు. **(Garden of South India).**

కేరళలో ఇంచుమించు 40 దిన పత్రికలు, వార పత్రికలూ ఉన్నాయి. ప్రజలకి చదవడమంటే చాలా ఇష్టం ప్రజలలో రాజకీయజ్ఞానం ఎక్కువ. గొప్ప, బీద ఎవరయినా పత్రికలు కొంటూ ఉంటారు. చాలా మంది చదువుకొన్నవారే నిరుద్యోగసమస్య ఇక్కడ గూడా యుంది

అక్కడ పంటలు-కొబ్బరి రబ్బరు, మిరియం, కట్టె పెండలము, అల్లం. కేరళలో అరణ్యాలవలన లభించే సంపదనంతా రసాయనిక ద్రవ్యములు, చేపలు పట్టడం, అట్టలలో తయారుచేయడం వీనికి ఉపయోగిస్తారు.

కేరళలో ఎర్నాకులం చాలా పెద్ద సహజసిద్ధమయిన ఓడరేవు హిందూదేశములో ఇది చాలా పెద్ద ఓడ రేవు కొచ్చిన్ ఒక పెద్ద నౌకాశ్రయము త్రివేంద్రంకు ఒక ప్రక్క పడమటి కనుమలు, వేరొక ప్రక్క అరేబియా సముద్రము ఎంతో కనుల పండువగా ఉన్నాయి ..

ఇక వీరి పండుగలలో ముఖ్యమయినది 'ఓణం' హిందువులకు, దీపావళీ, దసరాలవలె. క్రిష్టియనులకు క్రిస్మసువలె, మహమ్మదీయులకు రంజాన్‌వలె 'ఓణం' మళయాళులది ఈ పండుగ పది రోజులు చేస్తారు. చిన్నా పెద్దా, పిల్లాపాపా, ఆడామగా, గొప్పాబీదా అందరూ దీనిని చేస్తారు ఈ పండుగ మళయాళీ సంవత్సరం మొదటి నెల అయిన 'చింగమ్'లో వస్తుంది. అప్పుడు భూమిఅంతా సారవంతంగా యుండి సస్యశ్యామలంగా ఫలపుష్పాలతో శోభావంతంగా యుంటుంది రోజులు చక్కగా, రాత్రులు కాంతితో తారలతో మెరుస్తూయుంటాయి.

మనం సంక్రాంతికి చేసినట్లె వీరు పండుగ నెల ఉందనగానే ఇళ్లన్ని అలంకరిస్తారు. ఇళ్లకి సున్నాలు

శ్రీమతి అన్నపూర్ణా రాజన్న

కొట్టించి, గిన్నెలు తోమించి, పాతకుండలు మార్చి కొత్తవి పెడతారు. 'ఓణం' పదిరోజులు చేస్తారు. ఉదయమే వాకిలి ఊడ్చి ముగ్గులు పెడతారు పూరేకులతో. పదవరోజున అందరూ ప్రాతఃకాలముననే లేచి ఊడ్చి, రంగవల్లికలు తీర్చిదిద్ది, తలంటి పోసికొని, కొత్తబట్టలు ధరించి దేవాలయానికి వెడతారు. ఆ సమయంలో ఇంటి యజమాని నౌకర్లకి కొత్తబట్టలూ, బహుమతులూ ఇస్తాడు.

మధ్యాహ్నము విందులూ అవీ జరుగుతాయి. చదరంగం ఆటలు ఆడతారు. పిల్లలు బయట ఆడుకుంటారు. 'కథకళి' నాట్యం జరుగుతుంది. స్త్రీలు నాట్యంచేస్తారు. దీనిని 'కైకొత్తికాలి' అంటారు. చప్పట్లు చరుస్తూ ఆడుతారు. ఇది ఆడేటప్పుడు స్త్రీలు గుండ్రంగా నిలబడి అందులో కొందరు ఒక చరణం పాడితే మిగిలిన వారం దుకుని పాడతారు మిగతాది. ఓణం రోజున ఇది అందరి గృహాల్లోనూ జరుగుతుంది ఇది ఇంచు మించు మన గొబ్బిలా యుంటుంది. ఓణం సమయంలో వారీ పాటను పాడతారుట

ఒణ్ణాపూవిళియల్ లోన్యాల్ పాట్టుగళిల్
ఒడున్ తుడుయునీ ఒణాపూత్తుంబీ ఓమల్
పూత్తుంబీ

అవణి వట్టతి లారాడే తేనెకుడున్ చుడియపూదేడి
ఇత్తరిలేనుండు పుత్తరి చోరుండు పాట్టున్ను
వాడాము ॥ఓ॥

పారివోగు మలర్ తుంబి పాట్టాన్ను వాడాము ॥ఓ॥
వుళ్లివుడు పిట్టచెంగాలి పెళ్ళిలం కావిల చెంగాని
వెళ్ళి విళక్కు చిరిక్కున్ను విణ్ణిల్ల పూంగానిల్
ఇమలర్ ముట్టల్ బమలే నీవన్ను
కుళికళిక్కుంలే ॥ఓ॥

పొన్నుకురున్యాల తరున్యావిలో చెన్నిరిన్
నాడున్ చెంగాన్

పుల్లాంకుడుళ్ విళిక్కున్న పుత్తన్ను పొణ్ణోణం
పుణ్యట్టుకర్పిన్నాన్ పుత్తలి వేర్తున్యాన్ వోగల
పూత్తుంబీ వోగల పూత్తుంబీ ॥ఓ॥

ఇంకదీనిఅర్థం ఇది ఓణంపండుగ వచ్చింది. ఊయల లూగుతువా సీతాకోక చిలుకా శ్రావణ మాసం వచ్చింది. పూవులలో తేనెవెల్లివిరుస్తోంది పారి పోతున్నావే ఒక పాట పాడరాదా? తేనెసేవించి, కొత్త వరి అన్నము తిని తీయని ఒక పాట పాడరాదా?

లేత చిగురుటాకులలో ఊయల లూగుతూ గాలిలో ఆడుతూ వేణువువలె పాడితే పూగుత్తులు ఇస్తా నీకు

రంగు రంగుల రెక్కలు కల్గిన నేస్తమా నల్లని కాంతులు ప్రసరిస్తున్నాయి. చందమామ నవ్వుతున్నాడు. పచ్చని చేలో నీవు ఆడుతూ యుండు.

ఇంకా ఈ ఓణం సమయంలో 'వల్లంకాలి' అనే పడవ పందాలు జరుగుతాయి అలంకరింపబడిన పడవలో విగ్రహాలని పెట్టి ఉత్సవాలు జరుపుతారు. జనం గుంపుగా జేరతారు నది ఒడ్డున.

ఇంక ఈ పండగ యొక్క పుట్టుక గురించి మన సంక్రాంతికి దీపావళి వలెనే దీనికి గూడా ఒక కథ ఉంది రాక్షస రాజయిన బలిచక్రవర్తిని పరీక్షించడానికి వచ్చిన వామన మూర్తికి మూడడుగుల నేల నీయడము, దాని వలన వామనమూర్తి బలి శిరస్సుపై ఒక పాదముంచి ఆతని పాతాళలోకానికి త్రొక్కి వేయడమూ మనకి తెలిసిన కథయే ఆ విధంగా పాతాళలోకానికి పంపబడిన బలిచక్రవర్తి సంవత్సరాని కొకసారి తన ప్రజలనీ, రాజ్యాన్ని చూడ్డానికి వస్తాడని ఆ ఆనందంచేత ప్రజలు పండుగ చేస్తారనీ అంటారు. ఇదే ఈ పండుగ గురించిన పురాణ గాథ అని అంటారు. ఇదే ఓణం.



# పద్మశ్రీ అంబుజమ్మాళ్

ప్రముఖ సంఘసేవకురాలు బహుముఖ ప్రతిభాశాలి. మా ఆంధ్ర మహిళాసభకి చిరపరిచితురాలు అగు శ్రీమతి అంబుజమ్మాల్‌కి రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున పద్మశ్రీ గౌరవ బిరుదు నొసంగుట ఎంతయో ఆనందింప దగిన విషయం. ఈ సంవత్సరం గౌరవబిరుదు నొసంగబడిన వారిలో యీమె ఒక్కతియే స్త్రీ మిగతా అందరూ పురుషులే.

కీ. శే. యస్ శ్రీనివాసఅయ్యంగారి కుమార్తె యీమె. బాపూజీ ప్రభావానికి లోనై కారాగార వాసమనుభవించిన స్త్రీలలో యీమె ఒకరు. 1922. విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంలో కారాగారవాసమనుభవించారు. మాతా శిశు సంక్షేమంలో యీమెకి ప్రత్యేకశ్రద్ధ, తమిళ హిందీ భాషల్లో పండితురాలు, రచయిత్రిని. ఈమె రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖ అధ్యక్షురాలుగా పనిచేశారు. శ్రీనివాస గాంధినిలయమును నెలకొల్పారు. తులసీరామాయణాన్ని హిందీ నుంచి తమిళంలోకి అనువదించటమేగాక తన తండ్రిగారి జీవితచరిత్రనుగూడా రాశారు, అరవై అయిదేళ్ళు నిండిన ఈ సంఘ సేవికకు పద్మశ్రీ గౌరవ బిరుదు నొసంగుట ఎంతయో సమంజసమైన విషయం.

---

**FORM IV** **[Rule 8]**

**(As Prescribed in the Registration of Newspapers (Central) Rules, 1956)**

*Statement about ownership and other particulars of 'Andhra Mahila' (Telugu)*

1. Place of Publication ... 7A, Rosary Church Road, Santhome, Madras-4.
2. Periodicity of its publication ... Monthly
3. Printer's Name . N. R. Chendur
   Nationality .. Indian
   Address ... 7A, Rosary Church Road, Madras-4.
4. Publisher's Name .. N. R. Chendur
   Nationality ... Indian
   Address . 49, Mukathal Street, Madras-7
5. Editor's Name ... Mrs Malati Chendur
   Nationality ... Indian
   Address ... 49, Mukathal Street, Madras-7
6. Name and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital } "Andhra Mahila" Journal is owned by Andhra Mahila Sabha, which is a social service organisation, registered under Act XXI of 1860 No individual has any financial interest in the publication.

I. N. R. Chendur, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(N R Chendur)
Signature of Publisher

Date 29-2-'64

# లోకంతీరు

మధ్యాహ్నం మూడుగంటలైంది.

ప్రభుత్వ ఆస్పత్రికి విశ్రాంతి సమయం. ఆస్పత్రిలోని రోగులు హాయిగా నిద్రపోవడానికి అనువుగా ఫాన్లు తిరుగుతున్నాయి. నిద్రపోయేవారు పోతున్నారు. నిద్రపట్టనివాళ్లు మూలుగుతూ ప్రక్కనున్న వాళ్ళకి నిద్రాభంగం కలిగిస్తున్నారు

ఏడవనెంబరు వార్డులో పన్నెండో నెంబరు బెడ్‌మీద కూర్చుని రోగిరామయ్య, ఆస్పత్రి పనిమనిషి లక్ష్మితో ఏదో మెల్లిగా మాట్లాడుతున్నాడు.

ఆమె వయస్సు సుమారు పాతికపైబడి వుంటాయి. చామనచాయగా చూపరులకు ఆకర్షణీయంగానేవుంటుంది. అతను దాదాపు నలభైపై బడ్డవాడు. స్ఫురద్రూపి అయినాకూడా వ్యాధి అతని శరీరాన్ని ముసలితనానికి దగ్గరగాలాక్కువెళ్లింది. బట్టతల నెత్తిమీద నలుపు తెలుపు వెంట్రుకలు పలుచగావున్నాయి.

యిద్దరూ ఏవో గుసగుసలాడుకుంటున్నారు యిలాటి సన్నివేశం యిప్పటికి చాలామార్లయింది.

పది, పదకొండో నెంబరు పడకమీదవున్న రమణయ్య, మాణిక్యంలకు యీసన్నివేశంచాలా కంటగింపుగావుండేది. యివాళ యీ విషయాన్ని అటో యిటో తేల్చుకోవాలనుకున్నారు. కాని ధైర్యం చాలక అసూయతో పీరివైపే చూస్తూ పరస్పరం సంజ్ఞలతో ఏదో గుర్తుంచుకుంటున్నారు.

క్రమంగా వారిఓరిమి నశించింది.

మాణిక్యం రామయ్యను మోచేత్తో పొడిచి పొడిచి, "రామయ్యగారికి యౌవ్వనం వెనక్కి పరుగు తీస్తున్నట్టుందయ్యా రమణయ్యా! పూరు పొమ్మంటోంది, కాడిరమ్మంటోంది, యీ పరిస్థితిలోకూడా లక్ష్మిని చేరబిలుస్తున్నాడు" అని కిసుక్కున నవ్వేడు.

"అవును ఆమీదేవుందిమరి. మనం ఏపని చెప్పినా మొహం మాడ్చుకునే లక్ష్మి రామయ్యగారిదగ్గరికి మాత్రం మాటిమాటికి వచ్చి పరామర్శచేసి పోతూంటుంది" అంటు వంతపాడేడు రమణయ్య!

పైగా పన్నెండో నెంబరు బాగా కుదిరింది. గోడ అడ్డంకూడా వుంది"

"ముసలాడు దానికి ఏదోమందు చల్లి వుండాడులే!"

"ముసలాడువాడే నుక్కుపొడి ఘాటుకే అదివశమైపోయి వుంటుంది."

సంభాషణ వ్యంగంగా సాగుతూనేవుంది.

లక్ష్మిగాని, రామయ్యగాని తమ ధోరణిలో యివేం విన్పించుకున్నట్టులేరు. రామయ్య నెమ్మదిగా ప్రక్కకి తిరిగి గోడవారనున్న చిన్న బీరువాలోంచి కొంతసామాగ్రిని బయటికి తీశాడు. యింతలో లక్ష్మి తనుకట్టుకున్న చీరచెంగు లాగి పట్టుకుంది. రామయ్య చేతిలోని దంతా ఆమె చెంగులో పోశేడు. ఆమె అన్నిమూట కట్టుకుంది.

"ఇంక వెళ్లి రానా" ఆప్యాయంగా అన్నది ఆమె.

వెళ్లిరమ్మన్నట్టు తల ఆడించి చిరునవ్వు నవ్వేడు అతను. లక్ష్మి కనుమరుగు కాగానే అతని మొహంలోని చిరునవ్వు మాయమైంది. రెండు చేతుల్తోనూ మొహం కప్పుకున్నాడు.

రవణయ్య మాణిక్యం తమ సంభాషణలను మళ్లీ కొనసాగించేరు.

"యితనికి యిల్లూ వాకిలీ. బంధువులూ ఎవరూ వున్నట్టు లేదు! ఎవరైనా రావడం పరామర్శించి పోవడంలాటి వరసలు లేవు. అలాటపుడు ఆస్పత్రి వాళ్లిస్తున్న రొట్టె, పళ్లు పాలు అన్నింటినీ ఆ మెకు దానంచేస్తే యితని గతేం కావాలనో!" ఆశ్చర్యంతో అన్నాడు రవణయ్య.

"గతేముంది. అధోగతే! చూస్తున్నాంగా. నానాటికీ తీసికట్టు నాగం భట్టు అన్నట్టుగా వుంది పరిస్థితి" కాస్త జాలిగా అన్నాడు మాణిక్యం.

"అయినా ఆమె మొహం చూస్తూ గడపేందుకైనా ప్రాణాలు నిలుపుకోవాలా? అక్కర లేదా? ఎన్నాళ్ల నుంచీ వుంటున్నాడేమిటి?" కుతూహలంతో అడిగాడు రమణయ్య.

"వచ్చి రెండునెలలు కావస్తోంది. జబ్బేమిటో తెలియదుగాని రోజురోజుకి ఎక్కువవుతోంది. పైగా వాళ్లిచ్చే రొట్టె, పాలుచాలటం లేదని పెద్ద డాక్టరుగారిని అడిగి ఎక్కువగా యిప్పించుకుంటున్నాడు. అగంతా దాని మొహాన పెట్టి తను పస్తుపడి చచ్చేట్టున్నాడు" జవాబిచ్చాడు మాణిక్యం.

"లక్ష్మి చాలా అసాధ్యురాలు లాగా వుంది. దాని అందం, వొయ్యారం, నడక దాని కున్న పొగరు..."

"ఓహూ! అందని ద్రాక్షపళ్లు పులుపన్నట్టున్నాయి నీకబుర్లు" నవ్వేశాడు మాణిక్యం.

చివరి మాటలు అస్పష్టంగా విన్న రామయ్య ప్రక్కకి తిరిగి తీవ్రమైన చూపొకటి చూశాడు వారివైపు.

"ఎందుకు తాతా అలా చూస్తున్నావు మావేపు" హేళనగా అడిగేడు మాణిక్యం.

"కాస్త మీరిద్దరు నోళ్లకి తాళం వేసుకుని నిశ్శబ్దంగా వుండలేరా?" కోపంగానే వచ్చాయి మాటలు.

కాని వాటిని వాళ్లెవరూ లక్ష్య పెట్టలేదు.

"తాతా! లక్ష్మి నీకేమవుతుంది?" రమణయ్య అడిగేడు.

"చూస్తుంటే తెలియటం లేదా?" నవ్వుతూ జవాబిచ్చాడు మాణిక్యం.

రామయ్య రక్తం ఉడుకెత్తింది. "పెద్ద డాక్టరు గారితో చెప్పిమీనోళ్లకి తాళాలు వేయించగలను తెలుసా?". గట్టిగా అన్నాడు.

"ఓహూ! రిపోర్టు చేస్తావా? చెయ్యి, చెయ్యి. మేం రిపోర్టుచేస్తే ఏం జరుగుతుందో వూహించావా? నీ లక్ష్మి వుద్యోగం వూడుతుంది. నిన్ను ఆస్పత్రి నుంచి గెంటేస్తారు జాగ్రత్త!" అన్నాడు రవణయ్య కసిగా.

వాళ్ల నోళ్లకి తాళాలు వేయిస్తానన్న రామయ్య పై మాటలు వినగానే తననోటికి తనే తాళం వేసుకున్నాడు. పక్కనున్న కండువా తీసి వారి మాటలు వినడం యిష్టం లేదన్నట్టుగా రెండు చెవులచుట్టూ కప్పుకున్నాడు.

## 2

రామయ్యకు మొదట్లో కాళ్లు వాచి జబ్బు చేసింది. అది నయమయినా కాకుండానే ఒకదాని వెంట మరొకటి ఏదో ఒక జబ్బుచేస్తునే వుంది. తనొక దిక్కులేని వాడినని చెప్పి. పెద్ద డాక్టరు

******************
శ్రీమతి జె. నాగరాణి
******************

దయివల్ల ఆస్పత్రిలో చోటు సంపాదించుకున్నాడు.

అతని నిజమైన జబ్బుకి ఆ ఆస్పత్రిలో మందులేలేవేమో! విశాలవిశ్వంలాంటి ఆ ఆస్పత్రిలో వెదకి వేసారి. నిరాశచేసుకున్న మందు అది. అదిడబ్బు. డబ్బే అతని మందు.

అది దొరకదు. అతని రోగం నయంకాదు.

కఠోరమైన బాధల వల్ల ఏర్పడ్డ అనారోగ్యం, అందువల్ల దెబ్బతిన్న మానసికారోగ్యం భార్యాబిడ్డల గయ్యాళితనం. ఎంత తిన్నా తిండిచాలడంలేదనే వాళ్ళసాధింపులు, తాహతుకుమించిన వారికోరికలు యివేఅతనిరోగాలకు మూలకారణాలు. డబ్బును గురించిన విచారమే అతని జబ్బుకు ముఖ్యకారణం.

బాగాబ్రతికిన రోజులలో బాగానే సంపాదించాడన వచ్చు అందరినీ సాధ్యమైనంత వరకు ఏలోటూ లేకుండానే సాకేడు. పాతిక సంవత్సరాల వయస్సులో తండ్రి కాగలిగేడు. మొదటి సంతానానికి ముద్దులూ మురిపేలూ ఎక్కువగా జరిగి పోయాయి. తరువాత ప్రతియేటాపిల్లలే! తొమ్మిది నెలలూ మోయడం వరకే భార్య వంతు. తర్వాత పెంపకమంతా అతనివంతే! సంతానం వృద్ధి అవుతున్న కొద్దీ వారి మీద ప్రేమ కూడా వృద్ధి అవుతూ అందుకను గుణంగా ఖర్చులూ పెరుగుతూవచ్చాయి. కాని ఆదాయం మాత్రం గొర్రె తోకలాగానే వుండేది.

దురదృష్టవశాత్తు రెండేళ్ల క్రితం ఆ ఆదాయం కూడా, వచ్చేమార్గం లేక పోయింది. పెట్టిన వ్యాపారం దివాలా తీసింది అప్పులు పెరిగేయి. వాటిని తీర్చడంకోసమని యింట్లో ఏకాస్తోకూస్తో వున్న వెండి బంగారాలు తెగనమ్మాల్సి వచ్చేది. యీ విషయంలో భార్యా భర్తలిద్దరిమధ్యా వాద ప్రతివాదాలు చెలరేగేవి. అవిరానురాను తగువులై- తీవ్రకలహాలకు దారితీసి పరస్పరం మాటలుంకూడా లేని పరిస్థితి కొచ్చింది.

అతని భార్యకు పిల్లలమీద వెర్రిమమకారమొక్కటే తెలుసు డబ్బు విలువ తెలియలేదు. ఆమెకీ క్రమేపీ ఒంట్లో శక్తిసన్నగిల్లే సరికి ఏదో ఒకగిల్లి కజ్జా తెచ్చేది భర్తతో. పిల్లల్ని సరిగా పెంచే సామర్థ్యము లేదు ఆమెలో.

పిల్లలు ఎదుగుతున్నకొద్ది యిరుగు పొరుగును చూచి తాహతుకుమించిన కోరికలు కోరేవారు. వారికేది సమకూర్చక పోయినా ఆతల్లి కించపడేది.

రామయ్యకు పరిస్థితి క్రమంగా అర్థంకాసాగింది. యిక ఉన్నవూళ్లో కాలంగడపడం అసంభవం అనిపించింది. గత్యంతరంలేక భార్యాపిల్లల్ని అత్తవారింట్లో వదిలేసి త్వరలో వస్తానని మరోవూరికి బయిలు దేరాడు.

రోజుకో వూరు కాలినడకను తిరగడం. ఎప్పుడు, ఎక్కడ ఏదిలభిస్తే అదితినడం. ఒకదానికొకటి పడని పలురకాల నీళ్లుత్రాగవలసి రావడం. అందులో ఒకరోజు తింటె నాలుగు రోజులు పస్తుండడం-ఫలితంగా జబ్బున పడ్డాడు. దయార్ద్రహృదయు డెవరో యీ ఆస్పత్రిలో చేర్చాడు.

పెద్ద డాక్టరు చాలా మంచివాడు. ఎంతో ఆప్యాయంగా జాలిగా ప్రత్యేకంగా వైద్యం చేశాడు రెండు పూటల రొట్టె, పాలు, పండ్లు ఆహారం గాయిచ్చే వారు.

ఆ ఆహారంలో కొద్దిగా తను తీసుకుని మిగతదంతా లక్ష్మికిచ్చి పంపే వాడు.

తేరగా కూర్చోబెట్టి రెండు పూటలా తిండి పెట్టుంటే తినకుండా లక్ష్మి కివ్వడానికి కారాణమేమిటి? క్రొవ్వెక్కిందా? లేక తన జీవితంలో ఏర్పడిన అశాంతికి. అంధకారానికీ వెలుగు రేఖలు ఆమె నవ్వు ముఖంలో ద్యోతకమయినాయా?

ఆస్పత్రిలో అందరూ గుసగుసలు పోయారు. అతి రహస్యంగా అతడు చేస్తునపని బట్టబయలైంది. ఆమె స్త్రీ. అతను పురుషుడు యిక జనానికి కావాల్సిందేముంది?

ఆగస్టు నెలలో ఆస్పత్రిలో చేరిన అతనికి నవంబరునెల వస్తున్నాకూడా ఏమీ నయం కన్పింపలేదు. బహుశ తనకిచ్చే ఆహారాన్ని పూర్తిగా తింటూండివుంటే కొంచెం నయంగా వుండేదేమో !

## 3

దీపావళి సమీపిస్తోంది. సాయంకాలంనాలుగుగున్నరనుంచీ ఆరుగంటలవరకు విజిటింగుఅవర్స్.

ఏడో నెంబరు వార్డులోకి చాలామంది వచ్చి తమ ఆత్మీయులకు పళ్ళు వగైరాలిచ్చి ధైర్యం చెప్పి తిరిగి వెళ్తున్నారు.

పన్నెండో నెంబరు బెడ్ దగ్గరికి ఎవరూ రావటంలేదు. వచ్చేవారెవరూలేరు. రోజూ మూడు గంటలకల్లా వచ్చే లక్ష్మి ఆరోజు సాయంత్రం ఆరయినా రాలేదు. కారణం ఏమిటోనని ఆలోచిస్తున్నాడు రామయ్య.

రానురాను వచ్చిపోయే వారిసందడి తగ్గిపోయింది. దీపాలు పెట్టారు.

"తాతగారూ!" పలకరింపువిని పక్కకి చూశాడు రామయ్య.

"నేను అంటున్నానని కోప్పడకండి. మీ మంచికోసమే చెపుతున్నానుగాని, మీరెవరో నాకు తెలియదు. ఆ వొయ్యారిభామ మిమ్మల్ని బాగా బుట్టలోవేసుకుంది. మీరు అన్యాయంగా దాని వల్లో పడిపోతున్నారు" సానుభూతి చూపుతూ అన్నాడు మాణిక్యం.

"దౌర్భాగ్యుడా! నా సంగతి నీకెందుకు?" అందామనిపించింది కాని లక్ష్మి, నిజంగానే తన్ను మోసం చేస్తోందా? అన్న అనుమానం హృదయంలో ఏమూలో తొంగి చూచింది. కాకపోతే ఎప్పుడో వస్తానన్న మనిషి? పోనీ యింకెక్కడయినా పనిబడి రాలేదనుకున్నా, ఆస్పత్రికి రాగానే ఒక్కసారయినా కనిపించి పలకరించందే ఆమె ఎక్కడికీ వెళ్లేది కాదుగదా! మనసులోనే మధనపడుతూ మౌనంగా వుండిపోయాడు.

చిరునవ్వులు చిందించుకుంటూ లక్ష్మి రానే వచ్చింది.

ఆమెని చూడగానే ఆలోచనలలోంచి తేరుకుని ప్రయత్నపూర్వకంగా పెదవులమీదికి చిరునవ్వు తెప్పించుకున్నాడు రామయ్య.

మంచం దగ్గరగా వచ్చి చీర చెంగులో దాచుకున్న కాగితపు సంచిపైకి తీసింది ఆమె. అందులోంచి రెండు రవికెల గుడ్డలను తీసి అతనికి చూపెడుతూ "బజారుకెళ్ళి యివి కొనుక్కొచ్చే సరికి ఆలస్యమై పోయింది. మీకు నచ్చాయో చూడండి" అన్నది.

అతని ముఖం విప్పారింది. "లక్ష్మి నీకు వచ్చితేసరి! నాదేముంది?" అంటూ వాటిని చేతుల్లోకి తీసుకుని అటూ యిటూ తిప్పిచూశాడు. అతని హృదయం వుప్పొంగింది. యిన్నాళ్ళకి తనకోరిక నెరవేరింది. గుడ్డలు కూడా మేలు రకంలాగే వున్నాయి. ఖరీదు ఏమంత ఎక్కువకాదు.

"చాలా తెలివైనదానివి లక్ష్మి! మంచి రకాలు ఏరి తెచ్చావు అని వాటిని ఆమెకిచ్చేసేడు.

"సరే! అయితే మీరు యిదివరకు చెప్పినట్టే చేసెయ్యనా"

"మర్చి పోకుండా రేపే. ఆపనిచెయ్యి"

రవణయ్య, మాణిక్యం వేపు కన్నుగిలిపి "ముసలాడు దీపావళికనిగాబోలు ప్రియురాలికి జాకెట్ గుడ్డలు బహూకరిస్తున్నాడు. చూశావా?" అన్నాడు.

"పండగ ఖర్చులకని డబ్బుకూడా యిస్తున్నాడు చూశావా? యీలోగా ఏదో పనిమీద ఆవార్డుగుండా వెళ్తున్న రంజితం అనే నర్సు - తనవెనకాలే బూడ్సు టకాటకా చప్పుడు చేసుకుంటు వస్తున్న మరోనర్సు కాంతాన్ని చూసి ఆగింది. యిద్దరూ చేతిలో కొత్త గుడ్డలతో రామయ్యా దగ్గరగా నిలబడివున్న లక్ష్మిని గమనించారు. వాళ్ళ కళ్ళల్లోంచి నిప్పులు కురవడం ఎవరూ చూడలేదు.

"సంగతేమిటో యిప్పుడే తెల్చేస్తాను, యిదేం ఆస్పత్రా? లేక ... .... " అని పళ్ళు పటపట కొరుకుతూ ఒక అడుగు ముందుకు నడిచింది రంజితం.

కాంత గభాలున రంజితం చెయ్యి పట్టుకుని ఆపుతూ "అంతతొందర పనికిరాదు. యింతమంది లో ఆమెనలా గలభా చెయ్యడం మంచిదికాదు. ఎలాగూ పండగనాడు కొత్తరవికె తొడుక్కోకుండా రాదుకదా! అప్పుడే అన్నీ తేల్చుకోవచ్చు." అన్నది.

"గ్రహచారం : చూడలేకుండా వున్నాం యీ వేషాలన్నీ" అని తలమీద వేళ్ళతో కొట్టుకుంటు ముందుకు సాగిపోయింది రంజితం. ఆమెను అనుసరించింది కాంతం.

# 4

ఊరంతా దీపావళి సంబరాలతో మారు మ్రోగిపోతోంది. సాయంత్రం నాలుగుదాటింది. ఆరోజు లక్ష్మికి శెలవే అయినా రామయ్యకోసమని పండగరోజున యింట్లో చేసిన ఫలహారాలలో కొంత చెంగులో మూటకట్టుకుని ఆస్పత్రికి బయలుదేరింది. ఆమె మనస్సు చాలా నెమ్మదిగావుంది. అనుకున్న పనులన్నీ సక్రమంగా చేసెయ్య గలిగేనన్న సంతృప్తి ఆమె ముఖంలో స్పష్టమవుతోంది.

జబ్బుమనిషికి తీపి వస్తువులు పెట్టకూడదని తెలిసికూడా "యీ వొక్కరోజుకి ఏమైపోదులే" అన్న మొండిధైర్యంతో వాటిని మూటకట్టుకొని బయలు దేరింది.

ఆస్పత్రి వరండాలోనే రంజితం, కాంతం ఎదురయ్యారు ఆమెకి. చిరునవ్వుతో వాళ్ళిద్దరికీ నమస్కారంచేసి ప్రక్కకి తప్పుకుని వెళ్తోంది ఆమె.

"ఏమిటే లక్ష్మి వొళ్ళో దాచుకుని వస్తున్నావు" అంటు యిద్దరూ ఒకేసారి ప్రశ్నించారు. ఆ ప్రశ్న విని వులిక్కి పడ్డది లక్ష్మి. చెంగు విప్పి చూపెట్టమంటే తనగతేంకావాలి? రోగికి పెట్టకూడని వస్తువులు పెట్టున్నట్టు వాళ్ళు చూశారంటే యింకేమైనా వుందా? అలాగే తెల్ల మొహం వేసుకుని నిలబడింది.

"ఏమిటే ! నీ దొంగచూపులూ నువ్వూను" అన్నది కాంతం. "ఏం? నీ ప్రియుడిచ్చిన జాకెట్ తొడుక్కో లేదేం? యింకా కుట్టించలేదా?" ప్రశ్నమీదప్రశ్న అడుగుతున్నారు. ఆమెకేమీ అర్థంకాలేదు.

"ఏంటమ్మా మీ ప్రశ్నలు? నాకెం తెలీటం లేదు." అయోమయంగా అన్నది.

"పాపం ! ఏమీ ఎరగని నంగనాచివే!"

"వెళ్ళు, వెళ్ళు. మీ ఆయన నీ కోసం, నీ ఫలహారాలకోసం ఎదురుచూస్తున్నాడు. యిప్పటికే చాలా ఆలస్యమైంది" అంటు యిద్దరూ ఆమెకి దారివదిలేరు.

అప్పటికి సంగతేమిటో బోధపడింది ఆమెకి. ఆమె కళ్ళలోంచి అగ్నికణాలు రాలుతున్నట్లు అనిపించేయి. ఆమె అక్కడినుంచి కదల్లేదు. కాస్త తమాయించుకుంటు "అమ్మా! కాస్త నోరు జాగ్రత్త చేసుకుని మరీ మాట్లాడండి" అన్నది.

వాళ్ళిద్దరూ ఆమె కోపాన్ని చూసి ఏమీ చలించలేదు.

"హూ। ఆ ముసలాడు మతి నీ కేమవుతాడే" హేళనగా అడిగింది రంజితం.

లక్ష్మికి కన్నీరు కాలువలు కట్టింది. కళ్ళు వొత్తుకుంటు మీ కేమవుతారో నాకూ అదే అవుతారు" విసురుగా జవాబిచ్చింది.

"ఎంత ధైర్యమే నీకు? ఆ ముసలి ముండా వాడితో సరససల్లాపాలు జరుపుతూండడం కాకుండా మేంచూసి అడిగేమని ఉక్రోషంకూడానా? అంటూ లక్ష్మి చెంపను ఛెళ్ళుమనిపించింది కాంతం

లక్ష్మి దుఃఖం ఆపుకుంటు' గద్గద స్వరంతో

"నామాట కాస్త విన్పించుకోండి. ఆయన చేరక మునుపు నాకేమాత్రం పరిచయంలేదు. నాకాయన ఏమీకాడు. వచ్చిన కొత్తల్లో తన గోడు చెప్పుకుని ఏడ్చేవాడు. పిల్లా జెల్లా పది మందివున్న పెద్దసంసారం ఆయునది. ఎక్కడైనా వుద్యోగంచేసి డబ్బు పంపుతానని చెప్పి యిల్లు వదిలి వచ్చారుట. ఉద్యోగం దొరకలేదు. డబ్బు లేదు. తిండిలేదు జబ్బునపడ్డాడు. యింట్లో వాళ్ళకి తెలిస్తే లాభంలేదని తనసంగతి తెలియనివ్వ లేదుట. ఉద్యోగం చేస్తున్నట్లే తెలిపేరుట."

దుఃఖంతో ఆమె గొంతుక పూడుకుపోతూంది కాస్సేపటికి గొంతు సవరించుకుని మళ్ళీ ప్రారంభించింది.

నర్సులకిద్దరికీ ఆమె మాటలు కాస్త నమ్మకం కుదిర్చేయి.

"ఆస్పత్రి వాళ్ళిచ్చే రొట్టె, పాలు, నా కిచ్చి బజారులో అమ్మమనేవారు. మొదట్లో నా మనస్సు ఒప్పుకో లేదు. కాని ఆయన నా కాళ్లు పట్టుకున్నంతగా బ్రతిమాలేరు. తమ కుటుంబాన్ని గురించిన కష్టాలన్నీ చెప్పేరు. జాలేసి వొప్పుకున్నాను. యిన్ని రోజులూ రొట్టె, పాలుఅమ్మిన డబ్బులో ఆయన భార్యకు. పెద్ద కూతురికి చెరొక రవికెల గుడ్డను, మిగత రొక్కాన్నీ వాళ్లకు పంప మన్నారు. పంపించేను."

విషయ మంతా పూర్తిగా అర్థం చేసుకున్న నర్సులిద్దరూ పశ్చాత్తా పడ్డారు.

"లక్ష్మి! మమ్మల్ని క్షమించు. మాకన్న చిన్న వుద్యోగంలో వున్నా. తక్కువ చవుకున్నా, నీ కున్నంత విశాలహృదయం మాకు లేకపోయింది. పైగా నువ్వాయనకు చేస్తున్న సహాయానికి విపరీతార్థాలు కల్పించి, నిన్ను అపనిందల పాలు చేశాము." అంటూ రంజితం లక్ష్మి రెండు చేతులనూ పట్టుకుంది.

కోపంతో చేతుల్ని విదిలించుకుని వెనక్కి జరిగింది లక్ష్మి ఆవేశంతో.

"నిందపాలు చెయ్యడం లో మీతప్పేం లేదులెడమ్మ! నలుగురూతొక్కే దారిని మీరూ అనుసరించారు. ఆడది కనిపిస్తే చాలు సిగ్గుభిడియాలు, పాపపుణ్యాలు విడిచేసి దాన్ని పొందేవరకూ నిద్రపోదు మగజాతి. కాని అదేజాతిలో పుట్టినా తనకడుపు మాడ్చుకుని సంసారానికని రాత్రింబగళ్ల వేదనపడ్తూ శక్తివంచన లేకుండా సాయపడ్తున్న ఉత్తముడిని చూసే సరికి నా హృదయం ద్రవించింది. నా తండ్రిలాగా అను కున్నాను. చేతనైనసహాయం చేస్తూ ఆయున చుట్టుతిరుగు తున్నాను. అందుకే అంటూ వెక్కివెక్కి ఏడ్చింది లక్ష్మి. నర్సులిద్దరూ నెమ్మదిగా అక్కడి నుంచి జారుకున్నారు.

కాస్సేపటికి లక్ష్మి దుఃఖం ఆపుకుని కళ్లుతుడుచుకుంది. యిక అక్కడ నిలువ లేక రామయ్య వున్న వార్డులోకి వెళ్లి పోయింది.

వెళ్తూనే కొంగుముడి విప్పి కాస్త మిఠాయి పైకితీసి "యివిగో! యీకాస్త తినండి" అంటూ యివ్వ బోయింది.

"వద్దు లక్ష్మి! యీ పండగపూట వాళ్లేం తింటున్నారో ఏమిటో నాకేం తినాలని లేదు."

అంటూ ఆమెని వారించాడు.

కాని ఆమె వదల్లేదు. బలవంతం చేసి చివరికి కాస్తనోట్లో పెట్టించ గలిగింది.

అది అతనికి మింగుడు పళ్లేదు. గొంతులో అడ్డం పడి ఎక్కిళ్లు వచ్చాయి.

"యింట్లో తల్చు కుంటున్నారల్లే వుంది" చిరునవ్వునవ్వింది లక్ష్మి.

"నిజంగానా?" ఆ ఎక్కిళ్లతోనే తల్పైకెత్తి ఆశతో ఆమె ముఖంలో చూశాడు.

అవును అదేసమయంలో యింట్లో భార్య అతన్ని మనసారా తల్చుకుంటోంది. ఏవని?

"మీ నాయినకి కాస్తయినా బుర్రలేదల్లే వుందే మీనా పిచ్చెక్కిందేమో కూడాను. యీ రెండు రవికెలగుడ్డలు. యీ డబ్బు ఏమూలకి సరిపోతాయని ఆయన వుద్దేశం? అసలీ గుడ్డలు మనుషులు తొడుక్కునేవేనా?" అనిసాధిస్తోంది జవాబుగా కూతురు మీన.

"యిదేంటమ్మా! నాన్న గోధుమలూ, పంచదార అవీ పంపేవాడు కదా! యివాళ యీ వస్తువులేమిటి?" అన్నది.

"ఏళ్ళొగసన. బుద్ధిదిగసన అన్నట్టుందిలే మీ నాన్న సంగతి హాయిగా పట్నంలో కూచుని సంపాయిస్తున్నదంతా తగలేస్తూ మనకండ్లు తుడవడానికి యిటువంటి దేదో పంపుతూంటాడు." విసుక్కుంది ఆమె.

అయితే ఆమెది తప్పుకాదు. ఆమెనలా సృష్టించిన విధాతదే పొరబాటంతాను. భర్త దగ్గిరుండి సంపాదిస్తున్న రోజుల్లోనే ఆయన ఏం తెచ్చినా తప్పులుపట్టి సాధించకుండా వున్న రోజు లేదు. ధనాభావాన్ని ఏ మాత్రం అర్థం చేసుకోలేని మనోభావం ఆమెది.

రెండు నిమిషాలు ఉక్కిరి బిక్కిరయింది రామయ్యకు.

"వద్దు లక్ష్మి! యిష్టంలేకుండా నేను తినలేను నన్ను బలవంతపెట్టకు అయితే నన్ను యిప్పుడు యింట్లో అందరూ తల్చుకుంటున్నారు కదూ!" దీనంగా, అస్పష్టంగా వినవచ్చిందా స్వరం.

ఏ విధంగా తల్చుకుంటున్నారో అతనికి తెలియదు. తను పంపిన రవికెలను నలిపి విసిరివేసింది. భార్య అనికూడా అతనికి తెలీదు. అయితే ఆమె చేసినపని కూడా భర్తను గురించి త్వరలో వినబోయే విషాదవార్తకు నాందీ చిహ్నం.

★

## హైద్రాబాద్ విశేషాలు

ఫిబ్రవరి 22. వ తేదీ వుదయం వేళ ఆంధ్రమహిళా సభ ఎసెంబ్లీహాలునందు కస్తూరిబా యిరవయ్యోవ వర్ధంతిసభ జరిగినది. ఈ సభకి శ్రీమతి టి. చంద్రమతీదేవి అధ్యక్షత వహించారు.

ఆంధ్రమహిళా సభ ట్రస్టీ శ్రీమతి సుగుణమణి గారు అధ్యక్షురాలికి స్వాగతం చెపుతూ, పూజ్య కస్తూరిబా జీవితం నుండి యీ తరం యువతులు గ్రహించవలసిన వెన్నియోకలవని తెలిపారు, ఆదర్శ గృహిణిగా ఆమె బాపూజీకి తోడునీడగా నిలిచి, వారి అడుగుజాడల్లో నడిచిన ఆదర్శనారి అని అన్నారు. భర్తసేవలో ఆమెఅనేక కష్టనిష్టూరాలను ఎదుర్కొంటూ, భారత స్వాతంత్ర్య సమరంలో అత్యుత్తమమైన పాత్రని నిర్వహించారని తెలిపారు.

అధ్యక్షురాలు కస్తూరిబా జీవిత విశేషాలని సోదాహరణంగా పేర్కొన్నారు, బేసిక్ ట్రయినింగ్ విద్యార్థినిలు యమ్ శాంతకుమారి, కె. సుబ్బాయమ్మ మున్నగువారు ప్రసంగించారు. ఎ. విజయలక్ష్మి వందన సమర్పణతో జనగణమణ జాతీయగీతం తో ఆనాటిసభ ముగిసినది.



# నిదానమే ప్రధానం

## 1 వ రంగము

ఒక గదిలో 2 టేబుల్సు. రెండు టైపురైటర్సు. రెండు కుర్చీలు. గోడకి ఆఫీసు కాలండరు. టేబుల్సు మీదకొన్ని ఫైళ్లూ; టేబుల్స్ క్రింద చిత్తుకాయితాల బుట్టలు.)

రాధ : వాలుజడ. సన్నగా పొడుగ్గా; 5'ఎత్తు; ఎత్తుకు తగ్గలావు చేతిలో వానిటీబాగ్; సాదాచెప్పులు. సాదా అలంకరణ.

కస్తూరి : రెండుజడలు. 5'ఎత్తు. తగ్గలావు. చేతిలో వానిటీబాగ్. ఎత్తుమడమలకాలిజోళ్లు కళ్ళజోడు.

(రాధ టైపురైటరుమీద కవరుమూసి, వానిటీ బాగ్ తీసుకొని, కస్తూరి టేబుల్ వద్దకు నడచును)

రా : పనిపూర్తయినట్టేనా? పోదాంలే!

క : (పని చెయ్యటం ఆపి) ఎమిటే?

రా : పోదాంలే యిహ!

క : అబ్బ! యింకా చాలపనుంది. నా కిప్పుడప్పుడే తెమలదు నువ్వు వెళ్ళులే (పని తిరిగి ప్రారంభించ పోతూ వుంటుంది)

రా : నాతో ఏంచెప్పావు ఇందాక?

క : (పనిచెయ్యటంఆపి, రాధవంక చూస్తూ) ఏంచెప్పానబ్బా!

రా : సాయంత్రం తొందరగా తెమిలి సినిమాకిపోదామనుకోలా?

క : నిజంగా?

రా : (కస్తూరి బుజంమీద మెల్లిగా చరిచి) అబ్బ! అంత మతిమరుపా?

క : ఆఁ గుర్తొచ్చింది కానీ, యివాళ రాలేనే, రేపొద్దాంలే.

రా : పొద్దుట్నుంచి దానికోసమే కూచుంటే, నువ్వు యిప్పుడిలాగంటే ఎట్లా?

క : ఎక్సూజ్ చెయ్యవే ఈ ఒక్కసారి నన్ను క్షమించవూ?

రా ; హు! సరేలే, గిరిజ వస్తుందేమో కనుక్కొంటాలే.

## 2 వ రంగము

### సినిమాహాలు

(స్టేజిమీద, ముందు వరుసలో నిలువుగా 2 బెంచీలు బెంచీలమీద కొందరు కూర్చొని సైడువింగ్ లోకి చూస్తూంటారు. వెనుక 2 వరుసలు కుర్చీలూ, మొదటి వరసకుర్చీలకి లోపలి మూలగా కస్తూరి, చలపతిరావు కూర్చొనుంటారు. స్టేజికి అంచుగా 2 వ వరసలో రాధా, గిరిజా కూర్చొని మాట్లాడుతూ వుంటారు.

గిరిజ : కస్తూరి ఏమంది?

రా : పనెక్కువగా వుండుటవల్ల ఈ తడవకి రాలేను ఎక్సూజ్ చెయ్యమంది.

గి : మరి....ఆ వరసలో కూర్చున్న దెవ్వరో చూడు (మొదటి కుర్చీలవరసలో చివరకూర్చున్న కస్తూరి. చలపతివైపు చెయ్యి చాపాలి)

రా . ఆ!!

గి · ఎవరే?

రా : కస్తూరికాదూ?

గి : (కాస్తనవ్వుతూ) తిన్నగాచూసి చెపుదూ!

రా . సరేలే; స్పష్టంగా కనిపిస్తుంటే?

గి : అది సరేలే! దాంతో మాట్లాడుతున్న అతనెవరే?

రా : ఆ ఎంత! మోసం!

గి : ఏం?

రా : కస్తూరియిట్లా నన్ను మోసం చేస్తుందనుకోలేదెప్పుడూ, అది ఆఫీసులోచేరి యింకా ఒక నెలన్నా కాలేదు. అప్పుడే చలపతిని తన వల్లోవేసుకొందా?

అందుకే నాతో సినిమాకిరాలేదు.

(రాధ, కన్నీళ్ళతో, తనకి తలకాయ నొప్పిగావుంద దని గిరిజని ఒక్కదాన్ని సినిమాహాలులోవదలేసి ఇంటికి వెళ్ళిపోయింది)

## 3 వ రంగము

ఆఫీసులో ఉదయం 10 గంటలప్పుడు.

మొదటి రంగం మాదిరి. రాధ మైపు మిషను ముందు కూర్చుని కవరు తీస్తూ వుంటుంది. కస్తూరి ప్రవేశం. వానిటీబాగ్ తనబల్లపై పడేసి, రాధ దగ్గిర కొస్తుంది

క: రాధా? రాధా!

రా: (పలకదు)

క: ఏయ్! ఎంత పిలిచినా మాట్లాడవ్. నామీద కోప మొచ్చిందా?

రా: నాకెందుకు కోపం (అని కోపంగా అంటుంది)

క: నిన్న నీతో సినిమాకి రాలేదనేనా? (అని నవ్వి) మరేం ... (రాధ కస్తూరిని చెప్పనివ్వకండా)

రా: ఎవరిష్టమొచ్చిన వాళ్ళతో వాళ్ళు పోతారు. మధ్య నిన్నడిగే హక్కు నాకేంవుంది?

క: ఆహా! ఎంతకోపమే (రాధ గడ్డం పట్టుకొని తన వైపుకు తిప్పుకోవాలి)

రా: (విదిలించుకొని) నాతో మాట్లాడకు.

క: అసలు నీ మనసులో ఏదోవుంది నాకు చెప్పవూ? లేకపోతే యిక్కణ్నుంచి కదలను.

రా: మనసులో ఒకరకం, పైకోరకం నా పద్ధతికాదు

క. అసలింతకూ నువ్వేమంటావ్? (విసుగ్గా)

రా: ఏం అనదలుచుకోలేదు. నువ్వు యిక నాతో మాట్లాడవద్దు.

క: అంతయిదేం చేశానూ? నేను నిన్ను పలకరిస్తేనే నీకంత కష్టమౌతుందని తెలిస్తే, ఇటుకేసి వచ్చే దాన్నేకాదు. (ఆఫీసురూం వదిలి బైటికెళ్ళి పోతుంది)

(కాస్త విరామం. అదేసీను. చలపతిరావు సరదాగా ఆఫీసులో కొచ్చాడు. తెల్లపాంటు. చేతికి రిష్టువాచి బూటూ, టక్‌చేసిన తెల్లషర్టు)

చలపతి: రాధా!

రా: (మాట్లాడదు. మూతి తిప్పుకొంటుంది)

చ: అబ్బో! దేవతలకి కూడా కోపాలొస్తాయా?

రా: కోప్పట్టానికి నేనెవర్ని మధ్య? దయవుంచి యింకెప్పుడూ నాతో మాట్లాడకండి.

చ: ఎమిటి రాధా? అసలు సంగతేమిటి?

రా: జరగవలసిందేదో నాకు జరిగింది మీకెందుకూ?

చ: అదేమిటి?

రా: ఊ! దయచెయ్యండి.

చ: కారణం చెప్పవ్. ఇది అకారణ కోపం, సరేలే వస్తా. గుడ్‌బై.

రాధ కుర్చీలోంచి లేచి చలపతిరావు వెళ్ళినవేపు రెండడుగువేసి, పిలుద్దామనుకొని, చెయ్యి ఎత్తి, ఆగి పోయి చెయ్యి దింపేస్తుంది.)

## 4 వ రంగము

(మేనేజరు గోపాలరావుగారి గది)

సమయం సాయంత్రం 4 గం.

(ఒక పెద్ద టేబులు. వెనకగా పెద్దకుర్చీ. కుర్చీకి టేబులుకి మధ్య నుంచుని గోపాలరావు. పంచి కోటూ కళ్ళజోడుతో ఫైలునుచూస్తూ, ముఖం చిట్లిస్తూ వుంటాడు. రాధ ప్రవేసిస్తుంది చేతులో మైపుచేసిన కాయితాలతో)

రా: ఏమిటో చిరాకులో వున్నట్టున్నారే?

గో: రాతల్లీ! రా! ఏంలేదు మన ఆఫీసులో ఒకసీటు ఖాళీ వచ్చింది. దానికి నా మేనల్లుడు మురళిని సెలక్టు చేయించాను జాయిన్‌అవమని ఆర్డర్సుకూడ యిచ్చారు.

రా: శుభం! మరి అయితే ఆ ఆలోచనేమిటండీ?

గో: పూర్తిగా వినవమ్మా! చివరికి అది వేరొకళ్ళ

టి. ప్రసాదరావు

కిచ్చారు.

రా : అదేమిటి? తప్పుకదూ? మరి, మన ప్రొప్రయిటర్ గార్ని కలుసుకొని చెప్పకపోయ్యారూ?

గో : లాభం లేదు. అందులో కొచ్చింది. వారితమ్ముడి కొడుకే, చలపతిరావు నెరగవూ? మళ్లా వేరేఖాళీ వచ్చింది. పోనీయిందులో చేర్పిద్దామనుకొన్నాను. అదీ కుదరలేదు.

రా : చలపతిరావుగారు, మన ప్రొప్రయిటరు గారి తమ్ముడి కొడుకే? నాకుతెలేదే? సరే. అదట్లా వుంచండి. మరి యీ రెండో ఖాళీలో.

చ : అందులో కస్తూరిని వేశారుగా?

రా : అదేం పని ముందుగా శలక్టయ్యిన మురళి కివ్వకుండా మీ రెందుకూరు కొన్నారూ?

గో : లేదమ్మా. ప్రొప్రయిటర్ గారు చాలా మంచివారు. కస్తూరివారమ్మాయేగా. చదువయ్యాక ఇంట్లో పూరికే తోచదని ఇందులో చేరింది.

రా : ఆ !! కస్తూరి మన ప్రొప్రయిటరుగా రమ్మాయా!! (తలపట్టుకొని కుర్చీలో కూలబడు తుంది. అప్పటికే 5—10 గం. అయింది గబగబా, ఆఫీసు వదిలి కస్తూరి యింటికి వెడుతుంది.)

## 5 వ రంగము

సాయిత్రం 6 గం

స్టేజీకి ముందు వరుస క్రోటన్సు బంగాళా వరండా లాగు సర్దాలి. వరండాలో ఒక టీపాయి, ఒక కుర్చీ ఒక సోఫా, ఒక టేబుల్ ఫాన్. క్రోటన్సుకి వెనుకగా ఆరుజతల చెప్పులు. గోడకి పెద్ద కాలండరు.

రాధ : కస్తూరిగారూ !

...... ...... ..........

రా : కస్తూరిగారూ

క : ఎవరూ? (అంటూ బైటకొచ్చి రాధను చూచి ఆశ్చర్య పోతుంది )

రా : నిన్నటి అసభ్య ప్రవర్తనకు నన్ను క్షమించండి కస్తూరిగారూ నిజం తెలుసుకోక, మీ చుట్టరికాలూ అంతస్తులూ గ్రహించక ఎట్లాగో ప్రవర్తించాను. (తల క్రిందికి దించు కొంటుంది )

క అదేమిటి, మీరు, మీ రంటున్నావ్. నా అంతస్తు యివాళ తెలిసినంత మాత్రాన అధిక్యం యిచ్చి మాట్లాడతావా?

రా : (సిగ్గుపడు తుంది)

క : (రాధని దగ్గరగా తీసుకొంటుంది)

రా : ఆ దైవం నీ కెంత విశాల హృదయం యిచ్చాడు (ఏడుస్తుంది)

క : ఛా! ఎందుకూ ఏడవటం?

రా ఆనందం !

క అగు అన్నయ్యతో చెపుతా నీ ఆనందం: మావదిన మంచి దనే చెపుతాలే! ("మా వదిన సుకుమారి వదిన, మంగళ కరవదినా" అని పాడుతూ లోపలికి వెళ్లిపోతూ వుంటుంది)

(చలపతిరావు ప్రవేశం)

చ ఏమిటి నాతో చెప్పేది?

క : నాకేం తెలీదురా అన్నయ్యా ఈ అమ్మాయిని నిచూద్దూ! (అని లోపలికి పోతుంది)

రా : కస్తూరీ ! (అంటూలోపలికి వెళ్లబోతుంది)

చ . (అడ్డం వచ్చి, చెయ్యి పట్టుకొని)... ..

రా . నన్ను క్షమించ గలరా!

చ : తమరు రేపునుంచి వుద్యోగం మానేస్తేనే.

రా : అదేం?

చ : అదంతే!

రా : మరి, ఆ వుద్యోగంలో మన మేనజరుగారి మేనల్లుడు మురళిని వేయిస్తారా?

చ : మీ మామగార్నే అడుగండి.

రా : అయ్యో అయనగారితో మాట్లాడటానికే

ద రా : (స్టేజీలోకి వొస్తూ) ఏమిట్రా అది?

రా ఏం లేదండి రేపాకాయితాలు పైపుచేసి (తొట్రు పడుతుంది)

ద. రా : ఇంకా టైపేమిటి? నువ్వు యీ యింటి కోడలివి.

రా : మీ అంతస్థుకు . (నసుగుతుంది)

ద రా సరితూగ గలవో లేదో నాకు తెలుసు. అందు కే నిన్ను చలపతికి నిశ్చయించు కొన్నాను. గుణం ప్రధానంగాని, అంతస్తులూ, కులగోత్రాలూ ప్రధానం కాదమ్మా !

రా: (వంగి ఆయన కాళ్ళని కళ్ళకద్దుకొంటుంది)

ద రా : అమ్మా ఒక్కమాట జీవితంలో నిదానమే ప్రధానం అని గుర్తుంచుకో శుభం.

The Handicrafts Institute run under our auspices in Hyderabad has already trained 175 women in different crafts ; over a hundred of them are now employed as Craft Instructresses in the Welfare Extension Projects, Block Development Centres and in the Primary and Secondary Schools. 8 in the Cardboard and binding, 7 in the Cane and Bamboo work, 6 in the Dyeing and Printing, 4 in the Fancy Leather work and 12 in the Soft and Wooden Toy Making sections are at present under training.







The Sabha is also implementing in Hyderabad a Scheme of Condensed Course of education for adult women with twentyfive students for the H. S. C. examination. A Handloom Training Cum-Production centre is also established with thirty women working on fifteen looms.

# ANDHRA MAHILA SABHA NURSING HOME

STATISTICS FOR JAN 1964

OUT PATIENT DEPARTMENT :

| | |
|---|---|
| No. of Medical Cases Treated | 1,066 |
| „ „ Surgical „ „ | 53 |
| „ „ Ante-Natal „ „ | 233 |
| „ „ Post-Natal „ „ | 97 |
| „ „ Gynaec „ „ | 111 |
| „ „ E E N T „ „ | 46 |
| „ „ Dental „ „ | 8 |
| Total Number of New Patients Treated ... | 1,614 |
| „ „ „ Old „ „ .. | 1,368 |
| GRAND TOTAL . | 2,982 |

ADMISSION REGISTER -

| | |
|---|---|
| No. of Patients Admitted for Normal Delivery | 115 |
| „ „ „ „ „ Abnormal „ | |
| Breech Ext 2 T P Version I Forceps 6 | 9 |
| Ante Natal with False Pains Treated. | 13 |
| „ „ Ante-Natal with Toxaemia | 7 |
| „ „ Post-natal Cases Treated | 3 |
| „ „ Gyneac Cases „ | 29 |
| „ „ Medical Cases „ | 23 |
| „ „ Surgical Cases „ | 3 |
| „ „ babies admitted as Lodgers | 124 |
| Grand Total | 326 |

Dr. K R Ambuja
*Signature of Resident Medical Officer*

Dr. M Pavanabai
*Signature of Medical Superintendent*

B. Timmabai
*Joint Secretary*

Printed and Published by N K Chendar at Andhra Mahila Press 7 A, Rosary Church Road, San Thome, Madras-4 Hony Editor Mrs Malati Chendar